SREE

# JAGANMOHANA

# జగన్మోహన

[ ఐదంకముల నాటకము

గ్రంథకర్త:

గూడూరు కోటీశ్వరరావుగారు.

మొదటి కూర్పు 1000 ప్రతులు.

పబ్లిషర్సు:

సి. బి. దాస్, అండ్ కో.,

జాండ్రపేట,

గుంటూరు జిల్లా.

1925.

 [వెల రు 0—12—0.

శ్రీ

# జగన్మోహన

[ ఐదంకముల నాటకము ]

గ్రంథకర్త

పురూరవ, సంపూర్ణ రామాయణము, సీతాకళ్యాణము, మారుతివిజయము,
మారుతి మైరావణ సంగ్రామము, వీరభద్రవిజయము, కాంతామతి,
పద్మినీలోకబాంధవము, ఇత్యాది నాటకముల రచించిన,

## గూడూరు కోటీశ్వరరావుగారు.

మొదటి కూర్పు 1000 ప్రతులు.

పబ్లిషర్సు:

సి. బి. దాస్, అండ్ కో.,

జాండ్రపేట,

గుంటూరు జిల్లా.

శ్రీ భవానీ ముద్రాలయము, తెనాలి.

1925.

 [వెల రు 0—12—0.

# అంకితము.

శ్రీ మదగణిత గుణగణాలంకృతుండును, బుణ్యశ్లోకుండును,
వైద్యవిద్యావిశారదుండును, జ్యోతిశ్శాస్త్ర నిపుణుండును,
ఛాయాగ్రహణ తంత్ర విద్యాధికుండును, సర్వజన
సమ్మతుండును, శ్రీమతత్ గూడూరువంశ పయోధి
పారావార రాకాసుధాకరుండును,

కీర్తిశేషుండును,

నగు

## గూడూరు సుబ్బయ్యగారు.

మదీయ పినతండ్రి

## కి

నమస్కారభక్తి పురస్సరముగా అస్మద్విరచిత

## జగన్మోహన

నంకితముగా సమర్పించుచున్నాఁడను.

శ్రీ వారి యాత్మకు సర్వేశ్వరుఁడు శాంతినిచ్చుఁగావుత !

ఇట్లు

గూడూరు కోటీశ్వరరావు

# పీఠిక.



తే॥ గీ॥ రాత్రి తెగుదల దినమేల ♦ రాకయుండు ?
దినము తెగుదల రాత్రియే ♦ తేరకున్నె ?
సరఁగ సుఖదుఃఖములు గాల ♦ పర్యాయమున
నెందు మనుజులఁబొందక ♦ యేల యుడుగు ?

సోదరులారా !

నా విరచిత నాటకములన్నియు స్వకీయ "హిందూ మనో రంజని నాటకసభ"వారిచే పలుమారులు ప్రదర్శింపఁబడినవి. నేఁటికి క్రమముననాటకములన్నియు ముద్రించి యాంధ్రలోకమున కర్పించు చున్నాడను. సోదరయాదరణముండుఁగాక. ఈ జగన్మోహన పాతివ్రతల కథయై విలసిల్లి రంగస్థలమున కనుకూలమైనది. వీరసేనుని సత్యముచేతను మాండవీ మోహినుల పాతివ్రత్యములచేతను విష్ణుమూర్తి సాక్షాత్కరించి ఘటోదరిచేఁ బ్రాణములఁ గోల్పోయిన జగన్మోహనునకు ప్రాణదానమొసఁగి వారలచే స్తోత్రపాత్రుడయ్యెను.

తొలుత కథాసరణి యెట్లున్నను తుదకు భక్తిరస ప్రధానమై సత్యమునకు స్థానమై-పాఠకులమది కింపునింపియుండును.

ఈ నాటకమందన్య విరచితములఁ జేర్పకయే ప్రదర్శింపవలెను.

ఇట్లు,

వేజండ్ల,
1—10—25

గూడూరు కోటేశ్వర రావు.
గ్రంథకర్త.

# ఈ నాటకమునందలి ముఖ్యపాత్రలు



## పురుషులు

| | |
|---|---|
| జగన్మోహనుఁడు | కథానాయకుఁడు |
| వసంతుఁడు | జ॥ వేడుక చెలికాఁడు |
| కాపులు | |
| కాళానలుఁడు | |
| మంత్రులు | |
| వీరసేనమహారాజు | |
| వీర॥ సోదరులు | |
| విష్ణుమూర్తి | |
| సేవకుఁడు | |

## స్త్రీలు

| | |
|---|---|
| మాండవీదేవి | జగన్మోహనుని భార్య |
| మోహిని | కథానాయకి |
| ఘటోదరి | మోహినిని దెచ్చిన రక్కసి |

# ప్రస్తావన

(ప్రవేశము: నటుడు)

శా. శ్రీ వేజండ్ల పురీశ్వరుండు సతముం ♦ జెన్నొందు భక్తాళినిం
గావం గంకణమున్ ధరించిమిగులన్ ♦ గారుణ్యమున్ జూపుచున్
భావాతీతుఁడనాదిపూరుషుఁడు! గో ♦ పాలుండు! వాత్సల్యతన్
వేవేగన్ శుభదృష్టిమీకు సుమనో ♦ భీష్టంబులీడేర్చుతన్

ప్రేయసీ: ఇంతజాగేలఁజేసెదవు? తీవ్రముగ రమ్ము.

(ప్రవేశము: నటి)

ఆర్యా! ఏమి సెలవు?

నటు... నేఁడు "జగన్మోహన" నాటకము ప్రదర్శింపవలయునుగదా? నీవు సిద్ధముగనుండి యందర సిద్ధపరచితివా?

నటి... సిద్ధముగనేయుండిరి గాని "జగన్మోహన" నాటకమా నేఁడభినయించ యత్నించినది?

నటు... ఔను.

నటి... దీని రచించినదెవరు?

నటు... ఎఱుంగవా?

నటి... ఎఱింగిన నడుగం బనియేమి?

నటు... సీ. కలఁడు గూడూరు వంశ్యుండు ♦ ఘనయశుండు
మల్లయార్యుని పౌత్రుండు ♦ మాన్యతముఁడు
అరయ "వేంకటశివకవి" ♦ కగ్రసుతుఁడు
వ్రాసె గోటీశ్వరుఁడు దీని ♦ వాసిగాంచ.

నటి...ఓహో ! కోటీశ్వరరావా ? ఎఱుంగుదు నెఱుంగుదు. ఐన దీనికథావిశేషమేమి ?

నటు...తుదకు పతివ్రతా మాహాత్మ్యము వెల్లడియగును.

నటి...అటులనా ? ఐన ప్రదర్శనార్హమే యగు.

నటు...ప్రేయసీ ! జగన్మోహన మహారాజు గుణవంతుఁడు సుమా ?

నటి...గుణవంతుఁడో గణవంతుఁడో చాలపొద్దయినది రండుపోదము.

నటు...ఐనగీత మొకటుగ్గడింపు మీ మింట ప్రకాశించుచున్నశశినిఁ గూర్చి. పోవుదము.

నటి... గీ॥ సాంద్ర చంద్రిక రాకకీ ♦ జనములెల్ల
వేచి సంతసమందుచు ♦ వెదకుచుంద్రు
పాంథులకు నెంతోయా శశి ♦ పరమవైరి
యతని వర్ణింపఁ దగదింక ♦ మతిదోలంగు.

నటు...సఖీ ! నీకు చంద్రుఁడ హితుఁడా ?

నటి...అతఁడు పరపూరుషుఁడు—కళంకి—స్త్రీవంచకుఁడు—హితు డెట్లగు ?

నటు...బాగుగనున్నది, లోకోపకారి నెట్లంటివి ? చాలు యింక పోవుదమురమ్మా.

నటి...రండు పోవుదము.

నిష్క్రమింతురు.

ఇది ప్రస్తావన.





శ్రీ

# జగన్మోహన

## ప్రథమాంకము.

### ప్రథమ రంగము—దర్బారు.

[ ప్రవేశము: జగన్మోహనుఁడు. ]

( అనుబంధము 1. )

[స్వ] ఆహా ! ఏమీ దాని సౌందర్యము ? " జగన్మోహిని " యనఁ దానికే చెల్లును. అరరే ! అది స్వప్నమనుటకు వలను పడునా ? స్వప్నమైన ప్రత్యక్షమును మించునా ? ఔరా ! ఇది భ్రమయో నిజమో తెలియదు. [సంతసమున] ఆహా ! స్వప్నమైన నేమి ? దాని చూపులు మరుని తూపులనుమించి నన్ను వంచింపుచున్నవి. నిక్కముగ నా మహిళామణి యమరకాంతయై జనింపవలసినది. ఎన్నివిధములఁ దాని మరచెదమన్నను మరపునకు రాకున్నది మదనుండిదె యదనని మరింత తొందరగ పుష్పసాయకములచే నన్నుం దోలుచున్నవాఁడు. ఇదేమిచిత్రము ? ఆ తరుణినిఁ దలఁచినకొలఁది కళ్లెమూడిన తురంగంబువలె నామది నాకు వశముగాకున్నది. ఏమియుఁదోచుటలేదు. క్షణమొక యుగముగఁదోచుచున్నది. ఇట్టితరి నా మిత్రుఁడైన రాడయ్యెనే ? కారణ మేమైయుం

డును ? అతఁడు సదా వచ్చువేళ మించినదే ? ఆత డుండిన నా క్షీభమ తొలఁగునుగదా ? మనోహరీ ! లోకమోహన మనోహరరూపిణీ ! ఏల నన్నిట్ల గడుపఱచుట ? సిబిగి కౌఁగి లొసఁగి నన్ను మారసమరవ్యాపారపారీణునిఁ జేసి నా మనో రథ మీడేర్చరాదా ? నన్నిట్లారట మేలవెట్టెదవు ? ఆహా ! జగన్మోహినీ ! [ఇతర ధ్యానమున నుండును]

[ ప్రవేశము: వసంతుఁడు ]

[స్వ] మహారాజేదియో దీర్ఘాలోచనయందు మునిఁగియున్న ట్లు సూచనఁ గన్పట్టుచున్నయది. ఐనఁ బిలచెదఁగాక (ప్ర) మహారాజా ! జగన్మోహన మహారాజా !

జగ—[ఉలికిపాటున] ఓయీ ! నీయాగమన మెంతసేపైనది ?

వసం—మీ రెద్దియో చింతసేయు సమయముననే

జగ—రమ్ము. కూర్చుండుము

వసం—చిత్తము. (కూర్చుని) దేవా ! మీమదిఁగల యాలోచనయేమి?

జగ—ఏమున్నది ? ఏమియులేదు

వసం—ఏమియులేదా ? మీరుదాచినను అది దాఁగునదికాదు

జగ—సంగడీడా ! నీకడ దాపరమేమిగాని ఒక తరుణీమణి ఆహా ! ఏమి దాని సోయగము ?

ఉ॥ చక్కని రాచకన్నె నెఱ ♦ జాణత ! నేమని దెల్పుగున్ ? బళా !

వసం—ఆహా ! ఏమీ దాని సౌందర్యము ? మీరు దెల్పినంతనే నా మేను మంటలెత్తుచున్నది. పిమ్మట ?

జగ—చిక్కెతి దానిమాటలకుఁ ♦ జిత్తము చంచలమందెమిత్రమా !

వసం—(స్వ) యున్మాదమెక్కి శరీరమెఱుంగక జరించుచుండె. (ప్ర) తరువాత ?

జగ—నిక్కవమాసతీమణిని ♦ నేర్పుగఁ గూడుట లెప్పుడంచు

వసం—ఎప్పుడోయన నేల? నేఁడే పోవుదమురండు. చీకటిరోజులు గదా? మీకాటంక మెందుఁగలదు ? మీరు లోనికింజనుఁడు నేను గుమ్మముకడ వేచియుండెదను,

జగ—నా! కెక్కుడు తొందరొందెగన♦నెయ్యదిదో చక్క బేలనైతిఁగా.
వసం—దేవా! బేలగ నేలగావలెను? బాలగనైన నెక్కుడు లాభము గదా? ఇది మీకెఱింగించ నెంతవాఁడను?
జగ—వసంతా! నీ వెప్పుడు నింతియె. హాస్యమన్న నాల్కఁ గోసి కొందువు.
వసం—అయ్యా! నే నాల్కఁగోసికొందునా? నే నాల్కఁగోసికొన్న మీకిట్టి కార్యములయందు యోచన నెట్లు చెప్పగలను?
జగ—నీ వి సంభాషణ లింక జాలింపుము.
వసం—ఏమి చేయుమనెదరు?
జగ—ఏమిలేదు. ఎట్లైన నీవా కన్నె మిన్నను:-
వసం—దేవా! ఆబిడ యెవ్వరో సాంగముగ దెల్పకయే "నీవా కన్నె మిన్న" యన నెట్లు?
జగ—వసంతా! వినుము

గీ॥ కనక మోహనాకారమౌ ♦ కలికిమిన్న
ప్రాపునకువచ్చి మోహాబ్ధిఁ ♦ బడగనైచె
దానిసోయగ మయ్యారె! ♦ ధాతయెట్లుఁ
జేసెనో? గన నొక్కింతఁ ♦ జెప్పదరమె?

వసం—అంతచక్కని మానిసియా? అట్లయిన ముఖ్యముగ మీకుం డవలసినదే. జాలమేల? ప్రయత్నింపుఁడు
జగ—అదెట్లు లభించుట?
వసం—ఏల లభింపదు?
జగ— గీ॥ నిన్నరాతిరి సెజ్జపై ♦ నున్న నన్ను
జెనకి సంతోషముగను ము ♦ ద్దొనరబెట్టి:—
వసం—(స్వ) అదృష్టమన్న నిట్లుండవలయు? (ప) దేవా! ఎప్పటికైన నాకంతటి యదృష్టమబ్బునా? అట్లు జరిగిన నాకన్నెను మీకే యొసంగెద. ఆపైని?
జగ— పిమ్మట మనోజభవ్యకేళిఁ ♦ బ్రీతిదేల్చె
నేమిజెప్పుదు నాయింతి ♦ యెచ్చరికత॥

వసం—ఇంకేమి రొట్టెవిఱిగి నేతిలో బడ్డది. కాని యిది యంతయు నెచ్చట జరిగినది ?

జగ—స్వప్నమున.

వసం—సరిసరి స్వప్నమా ? అంతయు నిజమని యెంచుచున్నాఁడను అయినఁ బ్రత్యక్షముగఁ గలయకున్నను స్వప్నమునఁ గలసిరి అదియే పదివేలు. ఎట్లైనను స్వప్నము శుభప్రదమైనది.

జగ—ఐన నిందుల కేమనెదవు ?

వసం—ఇక యెంతో వింతగనున్నది. కలలోఁ గాంచినకాంతను సెజ్జ పైకెట్లు జేర్చగలను ? అది నిక్కమైన—సాధ్యమై—వశమై నామాట వినిన ఎట్లో శ్రమఁబడి మీ సాన్నిధ్యమున జేర్చు వాఁడనేగాని ఎండమావులలోని జలంబు దెమ్మన్న నెట్లు తే గలను ? ఇందులకే రాజులయెడ స్నేహ, సేవకా వృత్తులు కష్టమనెదరు

జగ.—వసంతా !

గీ॥ కుముదములనెంచు కందోయి ♦ క్రమము, బూర్ణ
చంద్రు నెదిరించు మోము ప ♦ సందు, మేల్మి
మించుగాత్రంబు, వలపుల ♦ ముంచె నన్ను
మోహనాంగి యొయ్యారంపు ♦ ముద్దుఁజూపి.—

వసం—అయ్యా చాలుఁజాలు. ఇంక నీ పురాణముఁ గట్టిపెట్టుఁడు కలలో జరిగిన కార్యము లిలలోఁ జరుగునా ?

[ ప్రవేశము: సేవకుఁడు ]

దేవా తమ్ము దర్శింప కొందఱు పౌరులు హాజరము గాచి యున్నారు.

జగ—శీఘ్రముగ వారిం బ్రవేశపెట్టుము పొమ్ము.

సేవ—చిత్తము. (నిష్క్రమించును)

జగ—వసంతా ! ఏల పౌరుల రాక ?

వసం—ఎవరిగోడవ వారిది. ప్రజలు యీతిబాధలంబడి మీకు మొఱలిడ వచ్చియుందురు

[ ప్రవేశము: కాపులు ]
( అనుబంధము 2. )

1 కా—దొరా మా ంగతేమి ?

గీ॥ కాయకంకులతోఁ బాలాల ♦ గ్రాలుచుండఁ
దక్కనేమాంకు ? మృగతతు ♦ లుక్కుమీరి
కాల్రదొక్కుచుఁ గోటలఁ ♦ గలయఁజీరె
నేమిదిని బ్రదికెదమింక ♦ భూమినాథ !—

2 కా—బాబూ ' యేలికా !

ఆ॥ దోసతోటకాడఁ దోడుసిపైన నా
తమ్ముఁడుండ వానిఁ ♦ దటిమి తరిమి
బట్టిజంపె నిన్న ♦ బాబయ్య సివ్వంగి
యేమిజెప్ప తెలుగ ♦ దేదుపింక ॥—

3 కా—అయ్యా ! ఆలకింపుఁడు.

కం॥ బాబయ్య ♦ భార్యనెప్పుడు
నేబాయకనుందునయ్య ! ♦ నిన్నటితోనే
నాబాకి దీర్చెనయ్యో !
ఈబరి నా చిరుతబట్టి ♦ యీడ్చుకఁబోయెన్ ॥—

4 కా—ప్రభూ ! మేమింక యిందు బ్రదుకఁజాలము

గీ॥ గొఱ్ఱె, మేకల, పశువుల, ♦ గొంకకుండఁ
జిన్నబిడ్డలఁగూడనే ♦ చింతలేక
కణుజుమృగములు గాజేసెఁ ♦ గన్నతండ్రి!
కాపురాలీడజేసింక ♦ గడువలేము ॥—

5 కా—దొరా ! మీరొచ్చి ఆ జంతువుల సావగొట్టి మమ్ము రచ్చిం చాలె లేకపోతే మేమందరం లెగిసి పోవాల్సినోళ్ళమే.

(అందఱు నమస్కరింతురు)

జగ—పౌరులారా ! దుఃఖించకుఁడు, మీకష్టములఁదీర్ప నేఁడే వచ్చె దను. మీ రింక మీ నివాసములకుం జనుఁడు. ధైర్య మూనుఁడు.

అందఱు-దొరా ! బేగిరావాలె. లేకపోతే సచ్చాము.
జగ—ఇదే మీవెంట నంటివచ్చెద. మీరు పొండు.
అంద— చిత్తం బాబూ ! చలవా ?
జగ—మంచిది పొండు.

(కాపులు నిష్క్రమింతురు)

జగ—వసంతా ! కాపుల మొఱలు వింటివిగదా ? జాగుసేయక నరణ్యంబునకుంజని క్రూరమృగంబుల రూపు మాపవలెను. నీవును రమ్ము పోవుదము.
వసం—అమ్మయ్యో ! ఆ అడవికివచ్చి—ఆపెద్దపులులను—ఆచిఱుతగండ్లను—ఆ యెలుగుబంట్లను—ఆ జింకలను—ఆకోతులను ఆ కుంజేళ్ళను—ఆ పాములను—ఆ పొదలనుఁజూచి యింక నేను బ్రతుకుదునా ?-మీ రేమన్ననుసరే నే నచ్చటికిరాను. బ్రతికియుండిన బల్సాకుఁదిని పల్లెలలోనైనఁ బ్రాణత్రాణార్థము జేసుకొని బ్రతికెదనుగాని:-
జగ—ఓయి వెఱ్ఱివాడా ! ప్రాణమన్న నీకింత తీపియా ?
వస—ప్రాణముపై తీపిలేనివారెవ్వరు ? అందు నేను పాలచే పెరిగినవాఁడనగుటచే నాకు ప్రాణమన్న మఱింత తీపి.
జగ—సరే. ఇంక నీ ప్రసంగముడుగుము. ఇది జాలమునకు సమయముగాదు.
వసం—చిత్తము.
జగ—సేవకా !

[ ప్రవేశము: సేవకుఁడు ]

దేవా ! శెలవు
జగ—నారాక దేవేరి కెఱింగించుము. పొమ్ము.
సేవ-చిత్తము (నిష్క్రమించును)
జగ—వసంతా ! రమ్ము పోవుదము.
వసం—చిత్తము. (నిష్క్రమింతురు)

యవనికజారును.

ద్వితీయరంగము—మాండవీదేవి నగరు

[ప్రవేశము. మాండవీదేవి] (ఆసీనయై)

ఆహా! నేఁడెట్టి యమంగళపు కలగంటిని? ఈస్వప్న ఫలమెట్లు ఫలించునోగదా? నాథా! ఏమీస్వప్నము?

గీ॥ దండకారణ్యమున కేగి ♦ తమకకుండ
వేట సల్పిన పిమ్మట ♦ వేసటంది
యందుసొక్కి నిదురఁబోవ ♦ సతివయొకతె
వచ్చి, మిముగాంచి మోహించి ♦ వదలకుండ
నిజ నివాసమునకుఁ జేర్చి ♦ నిక్కమిదియ—

అంతనయ్యాతి స్వజనంబుచే మీకిక్కట్టులొదవినట్లును. ఆబిడ మిమ్ము వరించుటచే మీపైఁగినిసి............హా! దైవమా! చెప్పుటకైన నోరాడకున్నదే? కట్టా! ముందెట్లు జరుగునో గదా? హా! పరమేశ్వరా! ఏమిసేయ నెంచితివి?

[విషాద మందుచుండును]

[ప్రవేశము: జగన్మోహనుఁడు]

(లేచి) నాథా! నమస్కారము. ఇయ్యాసనమలంకరింపుఁడు.

(అనుబంధము 3)

జగ—దేవీ! నేఁడేమొకో యొకవిధముగనుంటివి కారణమేమి? తను చ్ఛాయతగ్గినది. మోమునంగల కళలుమారినవి, మానసమే లకో విషాదమందినట్లు సూచించుచున్నయది? నీకెవ్వరేని యపకారంబొనర్చిరా?— లేక తూలనాడిరా? చెప్పుమా దురాత్ముల శిక్షించెద. ఆలసింపకుము.

మాండ—నాథా! ఏమియులేదు. మీరాకజాగగుటచే నేమియుందోచక నిట్లుంటిని గాని వేఱులేదు.

జగ—ప్రాణప్రియా! ఇంతమాత్రమునకే బేలవయ్యెదవేమి? విధివశంబున నిన్బాయుట తటస్థించినచో నీవేట్లుందువు?

మాండ—ప్రాణేశ్వరా! ఇట్లనెదరేమి? అమంగళము ప్రతిహతమగుగాక.

జగ—దేవీ! ఇంకఁ జాగొనరించరాదు. మన పురింగల పౌరులెల్లరు

మృగబాధ భరించలేక గొల్లున నల్లరిపెట్టి యేడ్చిరి. కాన వేటకేగవలయు.

మాండ—నాథా! నేఁడు వేటవలదు.

జగ—కారణమ్మో

మాండ—ఏమియు లేదు- జీవహింస గదాయని.

జగ—అబలా! రాజులకు వేటయేగదా ముదావహము? పోవకుండు టెట్లు? అదియేగదా ప్రజారక్షణము. అదియేగదా పురరక్షణము. ప్రజలఁగాసిఁజెందకుండఁగాచుటయేగదా రాచకార్యము. నేనిదేపోయెద ధైర్యమూని యంతిపురంబున సఖీజనంబులం గలసియుండుము.

మాండ—నాథా! వలదీకార్యముడుగుఁడు. చెరుగొడ్డివేఁడెద.

జగ—కాంతా! నేఁడేమొ వింతగ బల్కుచుంటివి. కారణమేమి? యీ కార్యమ్ముడుగుటెట్లు? అంతయు వింతగనున్నదే?

మాండ—ప్రాణేశ్వరా! ఏమని వచింతును? నేఁడొక యమంగళపు కలగంటిని.

జగ—కలగంటివా? ఏమది వచింపుము?

మాండ—నాథా! మీరు

సీ॥ వేటాడ బోయి బల్ । వేసటఁబడివని
శయనించియున్నట్టి । సమయమందు
కాంత యొక్కతె వచ్చి । కందోయిఁ బొడగాంచి
మోహంబు తలకెక్కి । ముదముతోడ
నిదురించు మిమ్ము నా । నెలఁత సొధముఁ జేర్చి
తెన్నుగానక మీరు । సన్నుతాంగిఁ
దెరువెయ్యది? యటంచు । దెల్పుమంచని వేడ
మోహించి మిమ్ముల । మోసపుచ్చె
గీ॥ అంత మీర్లలు చింతించి । యచటనుండి
రాఁదలంచియు జూడ మా । ర్గంబు లేక

నెట్టకేలకు నాకాంత । చెట్టఁబట్ట
నెంచి, శ్రమలెన్నొ బడితిరీ । రెంచఁజాల.—

శ్రమలందుటయేగాక తుదకాకాంతవలనఁ బ్రాణములసైతముఁ గోల్పోయినట్లు కలఁగంటిఁ గావున యీ స్వప్నఫలమెట్లుండునో యెఱుంగ. నా మనవి వినుఁడు. నేఁడు వేట కరుగకుఁడు.

(బ్రతిమాలును)

జగ—ప్రాణేశ్వరీ ! కలలోని వార్తలు నిజమగునా ? చాలు చాలు మిన్నకుండుము. స్త్రీలు చపలచిత్తులనుమాట నిల్పితివే ? నీ వెన్నివిధములఁ బ్రతిమాలినను నేఁడు వేటకరుగక తప్పదు. యింక నా పయనమున కడ్డుచెప్పకుము.

మాండ—నాథా ! మనవివినరా ?

( అనుబంధము 4 )

జగ—ప్రాణకాంతా ! నీ వింక యశుభముల బలుకకుము. నీ వెన్ని విధముల జెప్పినను వినువాఁడగాను. నేనిదే వెడలెద. ( లేచును )

మాండ—నాథా ! నే మీ కెదురాడఁజాల. మనవివినుఁడు.

జగ—ప్రియా ! యేలనీకీవెఱ్ఱి ? లోనకుం జనుము. నేనేగెద.

(నిష్క్రమించును)

మాండ—అయ్యో ! దైవమా ! నేఁడేమి సేయదలంచితివి ? నాపై దయవహించి నానాథుని మానసమిటు మరల్చి పుణ్యము గట్టుకొనుము.

సీ॥ వినడాయె నామాట ♦ జననాయెవనసీమ
వేటసల్పగఁ నెంచి ♦ వెడలినాఁడు
వలదంచు వెంటనేఁ ♦ గలగంటిననిదెల్ప
దలఁచకుండగనేగె । ధరణి విభుఁడు
హితవాక్యము లటంచు ♦ మతినెంచకనుబోయె
వెతలేమి గల్గునో ? ♦ క్షితివిభునకు
వాదించి యెవరైన ♦ బోధించి యిదిపాడి
గాదంచుఁ దెల్పెడి ♦ ఘనులెవారు ?

గీ॥ కాలకర్మ మదెట్లుగా ♦ గ్రాలనెంచి
యున్నదో ? దెల్పగలవార ♦ లున్నవారె ?
యేమిసేయుదు నికమీద ? ♦ నెవరుదిక్కు ?
సర్వమా దైవకృతముగా ♦ నిర్వహిల్లు.

హా ! దైవమా !

(మూర్ఛిల్లును)

యవనిక జారును.

---



# జగన్మోహన

## ద్వితీయాంకము.

### ప్రథమ రంగము—కాళానలుని యాస్థానము.

[ ప్రవేశము: కళానలుఁడు మంత్రులు. ]

1 మం—దేవా ! మీకింత యాలోచనయేల ?

కాళా—ఏమిసేయుమనెదవు ? తగుకన్నె లభింపకుండుటయే యాలోచన. నీకుమాత్రముఁ దెలియదా ?

2 మం—దేవా ! మనవి.

కాళా—ఏమది ?

2 మం—ఏమియులేదు మీ యప్పగారగు ఘటోదరీదేవి పెంపుడు బిడ్డయగు " మోహినీ " కన్యకన్న సౌందర్యవతులు గలరా? ఆ కన్యను వివాహమాడరాదా ?

కాళా—ఏమొ. ఘటోదరీదేవి నాకాకన్యనివ్వ నిచ్చగించునో లేదో సందియము. ఇదెట్లు ?

3 మం—లోకేశ్వరా ! ఏమి మీవెడగు ? ఘటోదరీదేవి మీకన్న నెక్కుడు గుణవంతుఁడు- రూపవంతుఁడు- బలవంతుఁడు నగు నల్లునిఁ దేఁగలదా ? మీరామెను మందలించిన మీకిచ్చి పరిణయ మొనర్చదా ? శంకింపక ప్రయత్నింపుఁడు శుభమగు.

కాళా—అమాత్యులారా ! నాకేమియుం దోచుటలేదు. ముందు కార్యక్రమ మెట్లుజరుగునో యెఱుంగ. మీయుపదేశముం గూడ విశ్వసనీయమే. ఐన నాయమను మందలించెద. పైని యీశ్వరానుగ్రహము మీశక్తియుక్తు లెట్లుండునో?—ఆమెను మందలించుటయే కర్తవ్యమా ?

4మం—అసురేశ్వరా ! మీరే స్వయముగ నాయమను మందలించ వలెను. ప్రభుచంద్రమా ! మీయట్టి వీరవిక్రమున కీయక మరెవ్వరి కాకన్య నిచ్చును ? మీపేరు విన్నమాత్రమున లోకములెల్ల నల్లకల్లోల మగునే ? మీభీమాకారము జూచిన మాత్రమున సకల గీర్వాణాధ్యక్షుండగు పురందరుండైన నేమూలనో యొదిగియుండునే ? మిమ్ము మించు వీరుడీ లోకమునం గలడా ? ఏమీవింత ?

కాళా—మంత్రులారా ! మీ యుపదేశానుసారముగ నేడే మా యప్పయగు ఘటోదరీదేవికడ కేగి ప్రసంగించి యామె యభిమతముం దెలిసికొని కాలానుసరణముగ కార్యమున కుపక్రమించెదను. ఇందులకు మీ యిష్టమేమి ?

మంత్రులు—ప్రభువతంసమా ! మీ కెదురాడువారమా ? మీయభిమతమే మా యభిమతము.

కాళా—మంచిది. ఈక్షణమందే పోవవలయు.

మంత్రు—చిత్తము. ( అందఱులేచి నిలతురు )

కాళా—మీరును రండు పోవుదము.—మీరిప్పుడు వలదు. నేవచ్చువఱకు నీ యాస్థానమందే యుండి జాగరూకులై మెలంగుడు. నేను సత్వరమ వచ్చెదను.

మంత్రు—చిత్తము.

కాళాసురుఁడు నిష్క్రమించును.

యవనిక జారును.



## ద్వితీయరంగము—ఘటోదరి మందిరము.

---

[ ప్రవేశము:ఘటోదరి ] ( ఆసీనయై )

( అనుబంధము. 5 )

ఏలకోగాని " మోహిని " నానాటికి కృశించి క్షీణించుచున్నది. ఎన్నివిధముల బుజ్జగించి యడిగినను కారణముఁదెల్పదయ్యె. అన్నపానీయంబులనైతముతనివిదీరభుజింపదు—సంతసముగ నుండదు—యల్లప్పుడు నుద్యానముల విహరించ నిచ్ఛగించి యందే కాలము గడపును— దీని రూపలావణ్యములఁజూడ ముచ్చటగుటచే దీనిని ఖండించి వండించి దిండిగాఁ దిననైతిని—ఎందఱందర రాచకన్నెల నిట్లుగాబట్టి యట్లొనర్ప లేదు ?—దీనిందెచ్చిన వేళయేమోకోగాని దీనిపైఁ బ్రేమ చాల నాకునిండియున్నది. దీనిచే నేను జావవలెనో నాచే నిది చావవలెనో దెలియదయ్యె. ఎంతప్రేమ యున్ననేమి? మనసిచ్చి మాటలాడదు—మదమాంసముల ముట్టదు—పోనీ మాంసాదుల ముట్టకున్నను అన్నపానీయములైనముట్టకున్నది. కారణమెఱుంగఁజాల. (యోచించి) ఆహా ! తెలసినది. యుక్తవయస్కురాలగుటచే మారసౌఖ్యమనుభవించ నైతి గదాయని యిట్లుగాఁ గుందుచుండె ( కొంచెమూరకుండి ) కాదు కాదు. " నేరక్కసిచేఁజిక్కితిఁగదా ? యింక నా గతి యేమని " భీతిచే దిగులంది గుండెలు చేతబట్టుకొని యిట్లు కృశింపనోపు. లేకున్న నిక్లేలయుండును ?—తన కేవేళను నేదియులోటొనర్చి యుండనైతినే ?—ఐననింక కొంతకాల మిట్లనేఁ జూచెద. అప్పటికిని కపటమును బాపి మైత్రిగ నుండకున్న నప్పుడే ఖండించి వండించి తిండిగాఁ దినెద. " ఇది ఘటోదరి " యని యెఱుంగదు. చనువుగనుండుటచే లెక్కసేయకున్నది. ( లోనకుఁజూచి ) చప్పుడగుచున్నది. ఆ వచ్చునది మోహినియేనా ? ఐనరానిమ్ము.

[ ప్రవేశము: కాళాసనలుఁడు ]

అక్కా ! నమస్కారము.

ఘటో—శుభమస్తు సోదరా ! ఇందుఁ గూర్చుండుము

కాళా—అక్కా ! మోహిని యేది ?

ఘటో—లోననే యుండినది. తమ్ముఁడా ! యెన్నడును మోహినినిఁ గూర్చి ముచ్చటించవే నేడేల దాని నడిగెదవు ?

కాళా—కాన్పింపకుండుటచే నడిగితిని.

ఘటో—కాదు కాదు. కారణమేమియో గలదు.

కాళా—ఏమియు లేదు. దాని పేరు జెప్పఁ గోర్కె జనించుటచే నిందువచ్చితిని నందుచేనడిగితిని. ఇందులకు నీయభిమతమేమి?

ఘటో—తమ్ముఁడా ! దాని చారిత్రమంతయు వింతగనున్నది—అన్న పానీయంబులఁదినదు. మౌనవ్రతము వహించినది ఐనఁ దాని యభిప్రాయముం దెలిసికొని నీకుఁ దెల్పెదనులెమ్ము.

కాళా—అభిప్రాయముఁ దెల్పుటయె కాదు. ఎట్లైన దాని నిర్బంధించియైన నాకుఁ బరిణయ మొనర్పవలయు. నీమాట మీరునా ? సామవాక్యములఁ జక్కఁబడకున్న రాక్షసకృత్య మగునని దెల్పుము. "మంచిమాటలకు మామిడికాయలు రాలునా? " యను సామ్యముం దెలుపుము.

ఘటో—నాశక్తి వంచన లేకుండఁగ సామదానముల బోధించెద.

కాళా—మంచిది. అట్లనే జేయుము.

ఘటో—సోదరా ! ఇంక నీవు పొమ్ము. దానిం జేరదీసి సర్వముం దెలిసికొనియెద. మన ప్రసంగంబు వినెనేని కార్యభంగం బగును. ఇప్పటికిఁ బొమ్ము.

కాళా—నేనిదే పోయెద.

ఘటో—మంచిది. పొమ్ము. (కాళాసనలుఁడు నిష్క్రమించుచు) (స్వ) ఎట్లుగా నీకార్యభారముందీర్తును?— అన్నపానీయం బులేకయుండిన రాచకన్నె రక్కసినిఁ బెండ్లియాడ నిచ్చగించునా? ఐనఁ బిలచి యడిగెదఁగాక. మోహినీ! మోహినీ! మోహినీ!

( తెరలో ఏమిపనిగల్గినది? )

ఘటో—నీవిందురమ్మా.

[ ప్రవేశము: మోహిని ]

అమ్మా! నమస్కారము. నన్నేలఁబిలచితివి ?

ఘటో—రమ్మా. ఇందుఁ గూర్చుండుము.

(మోహిని గూర్చుండును)

ఘటో—బిడ్డా! మోహినీ!

గీ॥ నిద్దురాహారములు మాని ♦ నీవిటుమరి
కుంది కృశియించు టేలనే ? ♦ డెందమందు
నిక్కువముఁదెల్పు మోహినీ! ♦ నీయభీష్ట
మెద్దియో దాఁదీర్చెద ♦ నెలమిగూర్ప.—

ఇట్లుగా శరీరము కృశింపఁజేసికొనుటచే నేమైన ఫలముగలదా?
యిట్లుండిన సౌఖ్యము గల్గునా ?

మోహి—అమ్మా! ఏమియు లేదు. ఇది నా స్వభావసిద్ధము.

ఘటో—ఏల యిట్లుగడించెదవు ? నీభావము నేనెఱుంగనా?

మోహి—ఎఱింగిన నిట్లడిగెదవేల ?

ఘటో—ఎఱుంగుటచేతనే యడుగుట. తెలసెనా ?

మోహి—తెలియకేమి ?

ఘటో—ఇట్లవివాహితగ నుంటివనియా నీచింత ?

మోహి—నీయట్టి తల్లిగల్గ నాకేమిచింత?

ఘటో—ఐన నీవిట్లుండఁ బాడిగాదు. నా వాక్యముల విశ్వసించి
వివాహమొనర్చుకొనుము.—సర్వసౌఖ్యములనుభవింతువు.

మోహి—తల్లీ! నాకేటికి పెండ్లి? వలదులెమ్మా.

ఘటో—అట్లుగాదు, నామాట వినుము. మొదటి నుండియు నీ
కదియే రోగము. నీమంకుతనమె నీకగచాట్లుదెచ్చుచున్నది.

మోహి—నామంకుదనమేమి ?

ఘటో—పరిణయము వలదనుటయే. వేరొండు గావలయునా ? నా
సోదరుండగు కాళానలుఁడు నీపై మోహమందియున్నవాఁడు

వానిని గాంధర్వవిధిని వివాహమొనర్చుకొనుము. సుఖించెదవు.

మోహి.—గీ॥ వలదు వలదన్న బెండిలి ♦ బలిమి నాకుఁ
జేయ నీకిది న్యాయమే ! ♦ జెప్పు ? యమ్మ !
రక్కసీంద్రకు రాసుతుల్ ♦ రాణులెట్లు
లగుదురో, సందియముమాని ♦ యానతిమ్మ. ?

ఘటో.—ఓసీ ! నాచేత నెప్పుడు జిక్కితివో యప్పుడే రక్కసివైతివి. ఇంకను రాచబిడ్డనని రాజసముఁ జూపుచుంటివా? ఇంకనైన బుద్ధిఁ దెచ్చుకొని కాళానలునిఁ జేపట్టుము. అతఁడు రక్కసుఁడని వేరుగ నెంచకుము.

మోహి.—అమ్మా ! ఘటోదరీదేవి !

గీ॥ ఎన్నినీతులఁ దెల్పిన ♦ నేమియన్న
బెండ్లియాడ నే వానిని ♦ పేర్మితోడఁ
జంపివైచిన నాకది ♦ సమ్మతంబె
కష్టములడంగు నామది ♦ కిష్టమిదియ.—

ఘటో.—నీయెడ ప్రేమఁజూపుటచే ధిక్కరించి పల్కుచుంటివా ? నీచాత్మా! నీవు కాళానలుని పెండ్లియాడకున్న నీవీపుడమిపై బ్రతుకఁ గలవా ? ఇది ఘటోదరియని యెఱుంగవే ?

( అనుబంధము. 6 )

నీకింక నైదురోజులు గడువిచ్చితి. ఇంతలో పమ్మతింపకున్న నీ రూపము సున్నయగునని నమ్ముము. పైని నీయిష్టము.

( నిష్క్రమించును )

మోహి.—హా ! దైవమా ! తుదకు నాకెట్టిగతిఁ గల్పించితివి ? ఈ బిడ తనసోదరుని గాంధర్వమునఁ జేపట్టుమని పట్టుబట్టినది. ఇంక నేనేమి సేయుదును ? హా ! పార్వతీశా ! నన్నేమిసేయ నెంచితివి ? నీభక్తురాలనే ?—నాకిట్టి యిడుములఁ గల్పింప నీకిదిన్యాయమా ? హా ! లోకేశా ! నన్గావుము.

(మూర్ఛిల్లును.)

( యవనికె జారును. )

## తృతీయరంగము: అడవి.

[ ప్రవేశము: జగన్మోహనుఁడు, వేటకాండ్రు ]

---

జగ—మృగయులారా !

గీ॥ అడవిమృగముల నన్నింటి ♦ మడియఁజేసి
ప్రజలబాధల మాన్పితి ♦ వారితముగఁ
జాలశ్రమఁజెంది యొడలుఁ ♦ దాళనైతి
నలయికను తీర్చుకొనివత్తు ♦ నరుగుఁడీరు.—

వేట తమకముచే మిగుల నలసటఁ జెందినాఁడ. గావున నీపథ పరిశ్రమదీర్చుకొని మీవెంటనే వచ్చెద నికమీరు పురమునకు పయనోన్ముఖులై మరలుఁడు. అల్లదే గాన్పించును ద్యానమునకుంజని సలిలంబులగ్రోలి యొక్కయామము విశ్రమించి వచ్చెద. మీరుపొండు.

వేట—చిత్తము. శలవు.

జగ—మంచిది. పొండు.

(వేటకాండ్రు నిష్క్రమింతురు)

(స్వ) ఆహా ! యేమీ యీ మలయమారుతము ? మనమున కానంద మొసఁగుచున్నదిఁగదా ? (పైకిఁజూచి) ఔరా ! యేమీ యీ భూరుహంబుల సోయగము ?

( అనుబంధము 7. )

సర్వశక్తియుతుండగు సర్వేశ్వరుని సృష్టివైచిత్ర్యము వర్ణింప నెవ్వరితరము ఏమీ దీని సోయగము ?—ఏమీ దీని లోకోపకారము ?

గీ॥ బాటసారులపథవిశ్ర ♦ మంబుబాప
చల్లదనమిడు పందిలి ♦ సరణిమించు
నట్లు, నిర్మించె నాధాత ! ♦ చెప్పగుంపుఁ
జార ! యేమనివర్ణింతు ? ♦ సహవిసొబగు.—

మరియు నిందుగల శుకపికాదిరవంబులు వినుటకు శ్రవణానంద మగుచుయు మనమున కానంద మొసగుచున్నయవి. భగవత్సృష్టి వైచిత్ర్యము వింతగదా ? (చెట్లంజూచి) ఔరా !

గీ॥ చక్రవాకమ్ము లొండొండు ♦ సరసమాడు
చున్నవచునట్లు, కూయుచు ♦ నున్నవహహా !
కీరశారికాదంపతుల్ ♦ జేరిపెలుచ
జంచినక్రీడఁదూగాడు ♦ చుంజెలంగె.—

మరియు నాబర్హిదంపతుల చిత్రమేమి ? ఔరా !

గీ॥ ప్రణయకోపముజల్లార్చు ప్రణ ♦ తులనఁగ
నారప్రియురాలి చెంగట ♦ జేరి నృత్య
మొక్కరీతిగ నొనరించుచుండె ధ్వనుల
నెమ్మిపోతులు గన్గొన ♦ నెమ్మిదనర.—

ఈ వనదర్శనముచే సంతసము జనించుచున్నను వేటతమకముచే తనువు బడలి నిస్సారముగ నున్నయది. ఇయ్యరణ్యామూవల గోచరించు నందనోద్యాన వనమునజని తనివిదీర సలిలంబులం గ్రోలి శ్రమబాపుకొంచ్చుట మేలగు. జాగుసేయక పోయెద. ఆనందనోద్యాన మెవ్వరిదైన యుండనోపు. ఎవ్వరిదైననేమి ? పోయి విశ్రమించెదగాక. అందు నే విశ్రమించిన నాపై నెవ్వరైన నేరమాపాదింతురేమొ ? నేరమాపాదించిన యాపాదించుగాక పోయి విశ్రమించి హాయి బొందెద.

( నిష్క్రమించును )

యవనిక జారును.





శ్రీ

# జగన్మోహన

## తృతీయాంకము.

### ప్రథమ రంగము—ఉద్యానము.

[ జగన్మోహనుఁడు శయనించి యొకవైపున ]

[ ప్రవేశము: మోహిని ] ( విషాదమున )



( అనుబంధము. 8 )

(స్వ) హా! దైవమా! తుదకునాగతి యెట్లైనది? లెక్కలేని సఖీజనంబులంగలసి సంతసముగనుండు నేనీరక్కసిచే నొక్కటెయేకాకినై భీతిచే గుండియలు చేతఁ బట్టుకొని విషాదమందవలసెనే! హా! జననీజనకులారా! నావియోగంబుచే మీరెంత కుందుచుండిరోగదా? కట్టా రాజహంసలారా! నాచేమేసంగినంగాని నీరమైనఁగ్రోలని మీరలాహారంబులేక నెట్లల్లాడుచుండిరోకదా?

సీ॥ నవమాసములు మోసి । నన్నుఁగనియుఁబెంచి
దయనుబ్రోచినతల్లి । దండ్రులార!
నాకష్టసుఖముల । స్తోకతోనారసి
క్షణముబాయనిచెలి । కత్తెలార!
నేనుసాపడకున్న । నీరముల్గ్రోలక

గన్గొనుచుండు ♦ శుకమ్ములార
గమనంబునఁగల ♦ గతిభేదములఁ దెల్పి
యాదరించిన రాజ ♦ హంసలార!

గీ॥ మిమ్మునెల్లరఁ బాసినే ♦ సమ్మతముగ
నున్న పాపిని, కటకటా! ♦ యుర్వియందు
నెయ్యదోగతిఁ దెల్పరే! ♦ యింకమీద—
నామదిఁజూడ జచ్చుటే ♦ నయము సుమ్మి.—

అయ్యో దైవమా! రక్కసి వాతఁ బడినది మొదలు నర సందర్శనము లేక యల్లాడుచుంటినే ?— నాకు బరిణయ మొనర్ప నాతలిదండ్రు లెంతో యత్నము జేసిరే? గృహిణినై సర్వ సౌఖ్యము లనుభవించెదనని యువ్విళ్లూరితినే ?— నా కోర్కెలెల్ల వమ్మయ్యె— నా జీవితమునకంతము గల్గె— సౌఖ్యమా, నా చెంత రాకుము— హర్షమా, దూరమున నుండుము— ధైర్యమా, నీ స్థానము బాయుము— మృత్యు దేవా, నామ్రోలనిల్చి నీకార్యము నీవు దీర్చుకొనుము. కటా! నా జీవితమెంతె దుర్భరమై భూభారమై దుఃఖభాజనమై యీ పుడమిపైనుండిన నేమి యుండిన నేమి? లోకేశా! అహర్నిశంబులు నీపదభక్తిచే మెలఁగు నన్నిట్టి దుఃఖసముద్రమున ముంచితివి? ఈ నడిసముద్రము నుండి యొడ్డుపట్టి నేను జీవించుదునా? కల్ల. ఇంక నాతలిదండ్రులాది సఖీజనంబులఁ గనులారఁ జూచి సంతసించు భాగ్యమీ మందభాగ్యురాలకీ జన్మమున లేదుగదా?

గీ॥ కంటినిండ నిద్దుర మఱి ♦ కడుపునిండఁ
గూడు దిని యెన్నినాళ్లాయె? ♦ నేఁడుజూడ
నేకరీతిగ నస్నిర్వాను ♦ వాఁకరీతి
గార్చు నన్గాంచి యోదార్చు ♦ ఘనులుగలరె?

అయ్యో! ఏమీ నా వెడగుందనము? రక్కసిచెంత కెవ్వరైన వత్తురా? ఒకవేళవచ్చినను జీవములతోఁ బోవుదురా?

తృతీయాంకము— ప్రథమరంగము

నిర్భాగ్యురాలనగుటచే బంధుమిత్రులం బాసి యొక్కతె నొక్కడ నుంటిని. నాకన్న నెవ్వరుందరు ? (ఉచ్ఛ్వాసముతో జగన్మోహనుని దెసదిలకించి) ఏమది. ఇందెవ్వరో శయనించినట్లు గాన్పించుచున్నయది. ఏమై యుండును ? మానవుండీడ కేల వచ్చి శయనించును ? చూచెదగాక (దగ్గరకేగి సంభ్రమముతో) ఆహా ! ఏమీ నాపూర్వపుణ్యము ? నేడియ్యుద్యానమందు కన్నులంగఅపుదీర నొకమానవునింగాంచితిని యాతండెవ్వండో చూచెదగాక. (చూచి) ఔరా ! ఏమీ వీని సుందరాకృతి? " జగన్మోహనుండన " నీ యువకునకే చెల్లును. నేనిప్పుడితని నా మందిరంబునకుం జేర్చెదను (మంత్రోచ్చారణ జేయును పెద్ద ధ్వని కల్గును. ఉద్యానవనమంతయు రక్షించి మేడయగును. మోహిని ఒకవైపున నిలచియుండును.)

జగ—(నిద్దురలేచి దిలకించి నివ్వెరపాటున) (స్వ) ఆహా ! ఏమిది ? అంతయు వింతగనున్నదే ? ఇంతకుం బూర్వము నేనుద్యానమునంగదా శయనించినది ? ఇపుడు తెల్లవారుచున్నంతలో చిత్ర విచిత్రమగు నొక సౌధమురీతిం గన్పట్టుచున్నది. ఇది కలయా ?— భ్రమయా ?— లేక నిక్కువమా ? నే శయనించిన స్థానమేగాదు. అంతయు విపరీతముగనున్నది ఈ సౌధముం దిలకించ భీకరాకృతిగల పాలపుతెల్లచె నిర్మించి యున్నది. ఇదెవ్వరిసౌధమై యుండనోపు ? ఈ ఇతరరూపము గల యీ సౌధముం జూడ రక్కసులదని చెప్పుచున్నయది. (చూచి) అదిగో ! యెవ్వరో తరుణీమణి గాన్పించుచున్నది.

( అనుబంధము 9 )

ఔరా ! దాని సోయగము ఏమని వర్ణింతును ? నేవర్ణింపం జాల. నేను గాదు. ఆ నలువకైనదరమా ?

మోహి—(దాపుంజేరి) ఆర్యా ! మీరెవ్వరు ? ఇచట రాగతమేమి ? దాపక సర్వముం దెలుపవేడెదను.

జగ—తరుణీమణీ ! నేనొక భూనాయకుఁడ "జగన్మోహనుఁడ"ను వాఁడ మృగయావినోదార్థమై యడవికిం జని వేటచే గల్గిన యాయాసముచే నిందుజేరి శ్రమబాయ నిద్రించి మేల్కాంచు సరికీ సౌధమున శయనించి యుండినాడను. నాకేమియుఁ దోచుటలేదు. అంతయు వింతగనున్నయది. ఇట్లు జరుగు టకు కారణమేమో యెఱుంగఁజాల యీ సౌధమెవ్వరిదో నీవెవ్వరిదానవో కరుణించి తెల్పుము. నీకు పుణ్యముఁ గాక.

మోహి—అయ్యా ! కుంభినీధవా ! "శరణంటిని" రక్షింపుము. ఆపైని నా యభీష్టమీడేర్చుము. భూకాంతులు శరణాగత బిరుదాంకితులుగదా ?

జగ—కాంతా ! భీతిల్లకుము. రక్షించెద. నీయభీష్టమేమి ? నీ వెవ్వతెవు ? సర్వముఁ దెల్పుము.

మోహి—జననాథా ! ఈ పురమునంగల "ఘటోదరి" యను రక్కసికి పెనుపుడు బిడ్డను నా పేరు మోహిని యందురు.

జగ—ఐన నేమందువు ? పైన వచింపుము ?

మోహి—ఏమియులేదు యీ రక్కసి వాతంబడిన నన్నుఁ జేపట్టి కృతార్థురాలఁ జేయుమని ప్రార్థన.

జగ—(స్వ) ఏమి యీవింత ? తాను రక్కసియట తన్నుఁ బెండ్లియాడి కృతార్థురాలఁ జేయవలయునట. అంతయు వింతగ నున్నదే ? (ప్ర) మోహినీ ! ఎన్నడైన నిట్టి విపరీతముగలదా ?

మోహి—ఇందు విపరీతమేముగలదు ?

జగ—అంతయు విపరీతమే.

మోహి—విపరీత మెద్దియో దెల్పుఁడు ?

జగ—తెలుపవలెనా ? మోహినీ !

సీసమాలిక.

అసురకాంతలఁబట్టి ♦ వసుమతీశ్వరులెందుఁ
బెండిలియాడిన ♦ పేరుగలదె !

మోహి—అసుర కాంతలటన్న ♦ పసయేమి లేద ? వి
వాహమాడిన పేరు ♦ పైనఁగలదు

జగ— మనుజభోజను లేడ ? ♦ మనుజప్రకర మేడ ?
సంయోగ మెట్టులు ♦ సంఘటిల్లు ?

మోహి—మానవస్త్రీ నినే ♦ మనుజాశనునియింటఁ
బెరుగుచుంటినిజాలఁ ♦ బ్రేమదనర

జగ— మనుజభామ వటంచు ♦ మదినమ్ముటెంకెట్లు ?
రక్కసినంచసి ♦ నొక్కియనవె ?

మోహి—ఘనరాజపుత్రినై ♦ కాలకర్మము చేతఁ
జిక్కి "ఘటోదరి" ♦ శిశునుంటి

జగ— రక్కసులిట్టులఁ ♦ బెక్కురీతులఁబల్కి
నమ్మించి యెంతోమో ♦ సమ్మొనర్తు

మోహి—నీపాదములయాన ♦ నిజముగ రక్కసిన్
గాదు గాదిదియ ని ♦ క్కమ్ముసుమ్ము

జగ— గీ॥ చాలుచాలింక నీమాయ ♦ సంగతులిక
నమ్ముదునె నేనుఁ ? జనుభవ ♦ నమ్మనకును

మోహి— జనగఁజాల నిన్బాసియో ♦ జనవరేణ్య !
పరిణయంబాడునన్ను సం ♦ భ్రమముతోడ—

జగ—రక్కసీ ! నీసరసము రసవంతముగ నేయున్నది. వెడగుకోర్కెఁ గోరకపొమ్ము. చాల తడవైనది. నేపురమున కేగవలెను.

( అనుబంధము. 5 )

మోహి—రాజా! నన్నుఁ జేపట్టి నాకోర్కెఁదీర్పక నెందుల కేగెదవు?

జగ—పురమునకు.

మోహి—ఎట్లేగెదవు ?

జగ—మార్గమున.

మోహి—మార్గముఁగలదా ? చిక్కునా ?

జగ—చిక్కకేమి ? మార్గమును మాటుపరచెదవా ?

మోహి—నేమార్గముదాచఁగలదాననైన నీచే నిరాకరింపఁబడుదునా!

జగ—ఆఁ నీరాక్షసకృత్యమంతయు వెలిబుచ్చుచుంటివే.

మోహి—రాజా! పలుమాటలేల? నన్నుఁ జేపట్టెదవా లేదా? లేకున్న నిన్నిప్పుడే మంత్రశక్తిచే నిందుండునట్లు జేసెద.

జగ—నన్ను నీవింతేయుంచెదవా? అది స్వప్నగత వృత్తాంతము.

మోహి—స్వప్నగతమో ప్రత్యక్షమో జూడుము.

( మంత్రోచ్ఛారణ జేయ లోన పెద్ద ధ్వని కల్గును )

జగ—(స్వ) ఆహా! ఎట్టిచెట్ట సంభవించినది? క్షణములో నెంత వింత జరిగినది? ఈ కాంత రూపలావణ్యములందు రాచకాంతగను పుల్కలనుబట్టిచూడ రాక్షసాంగనగను గాన్పించుచున్నది. ఈబిడ నివాసస్థానముగు నీసౌధము దిలకించ తలపు రెంచే నమస్సుఁ బడియున్నది. జౌరా! ఏమీ వింత నే నిందుండి వెడలబోవమున్నను మార్గము గనుపించక నేమియుం దోపక చిత్తము తత్తరిల్లుచున్నది. కనులు చీకట్లు గ్రమ్ముచున్నవి దీని మంత్రోచ్చాటనచే నామానసము ల్లకల్లోలమగుచున్నది. (కొంచెమాగి విషాదముచే) అయ్యో! నా గ్రహచారమా!

సీ॥ పాము పెల్లుబ్బి ♦ పలువిధంబుల నన్ను
వేటకురమ్మని ♦ వేడనేల?
వేడినంతనె నేను ♦ వేగవత్తునటంచు
బల్కి యుండక వారిఁ ♦ బనుప నేల!
బంపిన నేమాయె? ♦ భార్యహితవుమీరి
యడవికి వేటకై ♦ యరుగనేలఁ?
నరిగే వేటాడి ♦ యలసటఁబడి చాల
నుద్యానవనమున ♦ కుఱుక నేలఁ?
గీ॥ నుతికి శయనింపఁ గానేల? ♦ మఱచితనువు
కాలకర్మము నన్నిట్లు ♦ కానకీడ్చె
సుందరీడకు రానేల? ♦ జూడనేల?
నింతకతమేల? నాగతి ♦ యిట్టులేల?—

అకటా ! వేటగదాయని నమ్మివచ్చిన నెంతమోసముజరిగెను? ఇట్టిదుర్గతికి కారణమూ పౌరులేగదా? వారెక్కడనాకు దాపురించిరి ? అయ్యో ! దైవమా ! (రిచ్చపడును) (ప్ర)తరుణీ ! దయయుంచి మార్గముంజూపుము నీకు పుణ్యమగును.

మోహి—భూనాధా ! నిజమాస్వప్నగతము ? నేను రక్కసినిగాను ముమ్మాటికినమ్ముము. రాచకాంతనని యింతకుఁ బూర్వమే జెప్పియుంటినే ? ఐనను నీమదినమ్మకున్నది. కొంచమంత యిటురండు రహస్యమంతయు వెలిబుచ్చెదను.

( జగన్మోహనుఁడు సందియముచే నేలంజూచును )

ప్రియా ! సందియమేల ? రండుసర్వము దెల్లమగును.

జగ—( స్వ ) హా ! దైవమా ! నన్నెట్లుజేసితివి ? ఈబిడ జేసినకార్యములన్నియు వింతగనున్నయవి నే నిచ్చటనుండి కదలిపోవకున్న నింకేమిసేయునోగదా ? ఎట్లైనగానిమ్ము పోయెద

మోహి—ప్రియా ! రమ్ము సంశయింపకుము.

ఇర్వురు నిష్క్రమింతురు

యవనికజారును.



ద్వితీయరంగము: రక్కసిమేడ.

[ పునఃప్రవేశము: మోహిని, జగన్మోహనులు ]

మోహి-ఆర్యా ! స్త్రీలను నమ్మవచ్చునా ? మీారెటింగితిరిగదా ? అందు నేను రక్కసినిఁగదా ! ఇదెట్లు ?

( అనుబంధము 12 )

జగ—

ఉ॥ కాంతరో ! చెప్పుటేల ? మరి ♦ కాఁగలకార్యము గాకమానునే?
స్వాంతమునందు నమ్మకమె ♦ స్వాపముచే వడిఁదూలనాడితిఁ

శాంతముదాల్చి నీమదిని ♦ సర్వవిధంబుల నన్నుఁబ్రోవు ర
వ్వంతయు నేరమెంచకు మహా ! మృదువారిజనేత్రి ! మోహినీ!

( అనుబంధము 13 )

( పట్టుకొననెంచ మోహిని తప్పించుకొని )

మోహి—గీ॥ నీ వవినయంబులెల్ల నీ ♦ నేర్పులెల్ల
వినియు, కని, సంతసించితి ♦ వేయునేల ?
స్త్రీలనమ్మిన ముప్పు చే ♦ కూడునంచు
బల్కియున్న దెఱుంగవే ! ♦ పార్థివేంద్ర—

జగ—ప్రేయసీ ! నీ చారిత్ర మెఱుంగక నిక్కముగ రక్కసివనియే బల్కినాడ. ఇంకు నా నేరమేమి ?

( పట్టుకొననెంచ మోహిని తప్పించుకొని )

( అనుబంధము 14 )

మోహి—గీ॥ చాలుచాలింకఁ దెలసె నీ ♦ సరసమంత
నన్నుఁ జేపట్టరాకుమో ♦ వన్నెకాడ !
మేరమీరి ముట్టగరాకు ♦ కూరుతోడ
టంచు, నొట్టు బెట్టితిని స ♦ మంచితముగ.—

రాకుమారా ! సాహసించి స్త్రీలను ముట్టదగునా ? ఇదిగో! వట్టు. నన్ను ముట్టితివేని శ్రీహరితనయునియాన.—అంతరిక్షసంచారియగు తమ్ములసైరియాన.—జింక రౌతుయాన. — నీయాన.—నాయాన.— ( తొలగును )

జగ.—మనోహారీ !

చ॥ నిలువగఁజాలనేను నవ ♦ నీరజలోచన ! మారుబారికిఁ
గలిగిన తాపవారినిధి ♦ గట్టునుబట్టగఁజేసి సత్వరః
బలుమరు మోదముప్పతిల ♦ బాటిలఁజేసి దయారసంబుపై
జిలికియు, నన్ను ధన్యునిగఁ ♦ జేయుమటంచని నిన్ను వేడితిఁ —

( పట్టుకొననెంచ మోహిని తప్పించుకొని )

మోహి—గీ॥ చాలుచాలింపు మిట్టి వా ♦ గాలమింక
నన్ను ముట్టంగరాకుమో ♦ వన్నెకాడ !
నీదుత్రోవను బొమ్మప ♦ వాదులేల ?
సతియ నిటులాడుటలు మంచి ♦ సరసమగునె ?—

సాహసించి స్త్రీనిబట్ట నుంకించెదవా ?—తరుణియని మనమున శంకింపవా ?— కన్యకయని యెఱుఁగవా ?—నీ కి మార్గ మెవ్వరు బోధించిరి ?

( అనుబంధము 15. )

జగ—తమ్మికంటీ ! ఏటికీ బెదరింపులు ? తొలుత నన్నుఁ బ్రార్థించి "నన్నుఁ జేపట్టు "మని యుగ్గడించితివే ? ఇంతలోనే మఱచితివా ? నీకింత పొలయల్కఁ గలుగనని యెఱుఁగనైతి. లేకున్న నీతోడి నాకేమిపని ? కలికీ ! నాయెడ బ్రేమానురాగముం జూపి ప్రసన్నురాలవు గమ్ము.

[ పట్టుకొననెంచ మోహిని తప్పించుకొని ]

( అనుబంధము 16. )

మోహి—గీ॥ కాంతుఁడా ! నీమదెట్టులో ♦ గనదలంచి
బల్కితిని, వేరుగానెంచు ♦ భావమేల ?
నుండు, రక్కసికింజిక్క ♦ కుండమనము
పోవుదము లెమ్ము, పయనమై ♦ ప్రొద్దుగల్గ.—

మనోరమణా ! మనమున శంకింపకుండు. ఎట్టులైన నీ రక్కసి బారినుండి తప్పించుకొని పోవుదము లెండు. భీతిల్లక ధైర్య మూనుఁడు. ఈ రక్కసి మర్మమెల్ల నే నెఱుఁగుదును. (తెఱలో) మోహినీ ! మోహినీ ! ఎందుంటివి ?

జగ—రమణీ ! ఆ వచ్చువా రెవ్వరైయుందురు ?

మోహి—రమణా ! ధృతిబొందుఁడు. అదియే రక్కసి. ఇది యిప్పుడిచటికే వచ్చును. మీరు నావెంట రండు మిమ్మొకచో రహస్యముగ నుంచెద.

జగ.—ప్రియా ! అది నన్నుఁ జంపదుగదా ?

మోహి.-ఏమియు భీతిలేదు. ఆలసించక రండు.

( నిష్క్రమింతురు. )

[ పునఃప్రవేశము: మోహిని. ]

అబ్బ! ఈ రక్కసిముండ నాపాల యమదూత యైనదిగదా ? దీనిబారినుండి తప్పించుకొనలేక కుంది కృశించుచుంటిని. నా కియ్యవస్థ యింకెన్ని నాళ్ళుండునో దోచకున్నది. పోవుదమన్న వెంటనంటి చంపునని భీతిల్లుచుంటిని ( చూచి ) అదుగో ! వచ్చుచున్నది.

[ ప్రవేశము: ఘటోదరి ]

(చూచి)అమ్మా ! మోహినీ ! ముద్దుబిడ్డా ! నేఁడేమొ సంతసముగ నుంటివి ! కారణమేమి ! అనుదిన మిట్లుండిన నాకెక్కుడు సంతోషముగదా ? (ముద్దిడుకొనును) .

మోహి.—అమ్మా ! ఏమియులేదు. నాకు వివాహంబొనర్చెదనని నిన్న బల్కితివిగదా ?

ఘటో.—ఔను ! ఐన ?

మోహి.—అప్పటినుండియు మితిలేని యానంద మందుచుంటిని.

ఘటో.—(ఆఘ్రాణించు టభినయించి నలుదెసలం జూచుచు)

(స్వ) ఇది యెవ్వనినో క్రొత్తమానిసిని దెచ్చినట్లు నా ఘ్రాణేంద్రియము జెప్పుచున్నది. నిక్కముగ నిట్లే జరిగియుండును. ఐన చిన్నవుగ మందలించి గ్రహించెదగాక, ఎన్నడులేని ముఖమున కీవికాసమెట్లుగలిగినది?—అంగమునకంతకును నింత చురుకుదనమెచ్చటిది?—ఇంతసంతసముగ మాట్లాడుటేల ?— నిక్కముగ నూతన పురుషునిఁ దెచ్చినది ? (ప్ర) అమ్మా ! మోహినీ ! ఎవ్వరోక్రొత్తలు మనయింట నుండినట్లుగఁ దోచు చున్నది ఎవ్వరైయుందురు ?

మోహి-ఎవరువచ్చిరి ? ఎవరును రాలేదే.

ఘటో—పోనిమ్ము. వచ్చిన వత్తురుగాక. ఏపురుషునైనఁ బ్రేమించి దెచ్చితివా ? చెప్పుము భయములేదు.

మోహి-తల్లీ ! నీవెఱుంగక నే నెవ్వనిఁదెత్తును ? అట్లు దెచ్చుటకు నీయాజ్ఞ యుండవలెనుగదా ?

ఘటో—పిచ్చిదానా ! నాయాజ్ఞ యెందులకమ్మా ? యుక్తవయస్కురాలవు—అందు రాచబిడ్డవు—నీకునచ్చినపురుషునిఁ జేపట్టు కర్తవ్యము నీయదికాని యింక నాదేమి పెత్తనమున్నది ? అంతయు నీయిష్టమేగదా ?

మోహి-అమ్మా ! నన్ను నమ్మకుంటివే ? ఇంక నేనేమిజెప్పగలను ? ఈ లోకమున యనృతమే నమ్మదగినది. అల్పులనే గౌరవించునది.

ఘటో—(స్వ) ఇది నిజము జెప్పకున్నది. నా మర్మమెల్ల జెప్పుటచే నన్నే మాయజేయుచున్నది. ఇంక దీని నేమిసేయగలను ? (ప్ర) మోహినీ ! నీకొఱక చక్కనిపురుషునిఁ దెచ్చెదను వానిఁ బెండ్లాడి సుఖించుచు నింటనుండుము.

మోహి-(స్వ) ఓహో ! ఇదేదో యుక్తిబన్నినది. ఇంక నిజముఁ జెప్పకున్న మోసము జరుగును. (ప్ర) తల్లీ ! పరిణయమేల నాకు ? వలదు మెమ్ము నీకేల యాశ్రమ ?

ఘటో—నాశ్రమ కోర్వఁజాలనిదాననైన నీ యిచ్చవచ్చిన పురుషునిఁ దెచ్చుకొని నా కన్నులకు విందొనఁగరాదా ?

(మోహిని మాటాడక తలవంచుకొనును)

బిడ్డా ! మాటాడవేమి ? పోనిమ్ము నీవు దెచ్చినవానినే జేపట్టుము. అదియు నాకుసమ్మతమే. ఆతఁడెట్టిరూపవంతుడో—ఎట్టి గుణవంతుడో—ఎట్టి యౌవనవంతుడో చూడఁ గోర్కెజనింప నిట్లడిగితిని కాని లేకున్న కోరుదునా ? బిడ్డా ! సంశయింపక నీపురుషునిఁ జూపుము. ఏమి మాటాడవు ?

( అనుబంధము 17. )

ఉ॥ దాపరమేలఁ జెప్పుము య ♦ దార్థము బిమ్మట జూపుమాతనిక
కాపథమింతవీడు మతిఁ♦గాంక్షదలిర్పగ బ్రోచుచున్న నా
ప్రాపుదొరంగకుండుమిటఁ ♦ బ్రాభవమొప్పగ నిర్భయంబుగాఁ
బాపమునంభవించు నిజ ♦ పద్ధతిఁదాచితివే నిజాత్మజా !—

( అనుబంధము 18. )

మోహి-[స] ఇది సత్యముజెప్పువరకు విడచునట్లులేదు. ఐనఁ జెప్పెద
సర్వమాన కాదైవమేగలఁడు. [ప్ర] అమ్మా ! [తలవంచును,

ఘటో—ఏమది ! చెప్పక మరల మిన్నకుంటివి ?

మోహి-ఏమియులేదు. నీయెడఁగల భీతిచేఁ జెప్పుటకు నోరాడకున్నది
[మెల్లన] నే నెవ్వనిని దెచ్చియుండలేదు.

( అనుబంధము 19 )

ఘటో—నేను నీకు భీతిఁగొల్పుచుంటినా ? పిచ్చిదానా ! నీ కోర్కెఁ
దీర్చెదననియే బల్కుచుంటినిగదా ? ఇంక సందియమేల ?
సత్యముఁబల్కుము. ఈ భాగ్యమున కింత రద్దియూ ?—
ఇంత గోలయా ?

మోహి-(తలవంచి) నేఁటి దివసావసానమున నందనోద్యానమందొక
రాకొమరుడు లభించెను. వానిం జేపట్టనెంచిమంత్రోచ్చారణ
చేత నీ నిలయముఁ జేర్చితిని. పాప మాతఁ డనేక విధముల
మార్గము జూపుమని వేడినను అంగీకరించక నిందే మాటు
బుచ్చితిని.

ఘటో—(తొందఱగ) బిడ్డా ! తోడ్కొని రమ్ము చూతము.

(మోహిని నిష్క్రమించును)

ఔరా ! ఎంతమాయలాడి ? ఎన్నివిధముల బుజ్జగించి మంద
లించినను సత్యముఁ జెప్పక వేధించినదే ? కానిమ్ము. నేఁడే
వివాహమొనర్చెదనను మిష బెట్టి నమ్మించి నేఁటి యర్ధరాత్రి

మంజాతనిఁ గడతేర్చెదను. (ఆలోచించి) ఇక్కార్య మెట్లో నర్తును ? తెలసినది. ఈతని బెండ్లికొమరునిం జేసెదనని బల్కి కాలికిగుర్తుగ నొక కడియముంచి నాజనంబులతోసహా మత్తుగల్లునట్లుగ సారాయము ద్రావించి యందుచే తనువెరుంగకనుండుతరి నాకత్తిచేఁ గుత్తుక నుత్తరించెదగాక. ఇదియే మంచియోచన. ఇందులకొక కడియముం దెచ్చెదగాక.

(నిష్క్రమించును)

[ ప్రవేశము: మోహిని జగన్మోహనులు. ]

జగ—ప్రియా ! ఏది నీ తల్లి ?—ఏమనినది.

మోహి-భూజానీ ! ఆమె యంగీకరించినది. నీవింక భీతినొందకుము. అదుగో ! వచ్చుచున్నది.

[ పునఃప్రవేశము: ఘటోదరి. ]

(ఇరువురిపై చేతులువైచి) ఆహా ! నేఁడుగదా నాకు సంతసము గలిగినది. బిడ్డా ! ఎంతచక్కనివాని సంపాదించితివమ్మా ! ధన్యురాలవు. పుణ్యురాలవు నీ యందచందముల కీతడే దగియుండె. ఇంక జాగొనరించక నేఁడే వివాహ మొనర్చెద. జామాతా ! నేఁటి ద్వితీయయామాంతరమున లగ్నము నిశ్చయించితిని. మఱియు మా కులాచారమురీతిగ నిన్నుఁ బెండ్లికొమరునిఁ జేయవలెను గాన నీబంగరు గండపెండేరమును నీపాద మలంకరింపజేతును ముందునకు రమ్ము. ఆలసించక రమ్ము తుమ్మెదరేమొ.

(జగన్మోహనుఁడు ముందుకువచ్చును కాలి కందెవేసి) ఇంక విందారగించ లోని కేగుము. మోహిని ! నీవును పొమ్ము.

( మోహిని, జగన్మోహనులు లోనికేగుదురు. )

నేఁడు పెండ్లిసేయుదుననను మిషచే గుర్తుఁగ గాలికి కడియమొకటి వేసితని. మత్తుచే శయనించినప్పుడు పీఁగడతేర్చెదను. మరచితిని యీ కడియముంగూర్చి మోహినికి సర్వముం దెలి

యును. ఆమోసగారి యేమైన కార్యభంగ మొనర్చునేమో? నేజాగుసేయక మాంసముచేతను సారాయముచేత సందఱి నోడలెఱుంగకుండునట్లు జేసి నాపని నేను దీర్చెదగాక.

( అనుబంధము 20 )

ఇది ఘటోదరియని యెఱుంగడు. రాచకుల జాతులకు గుండెలలోని ముల్లని దలఁచదుగాబోలు. నేఁడు వీని కాయువు క్షీణించి యిచ్చటికరుదెంచినాడు. అందువలననే గగనమున చంద్రుఁడు వీని మరణముగాంచి సాక్ష్యముండవలసివచ్చునని భీతిజెంది చివ్వున పారిపోవుచున్నవాఁడు. ఓరీ ! రాజవంశాధమా ! వచ్చుచుంటిని.

లోనకు పరుగెత్తును.

యవనిక జారును.





# జగన్మోహన

## చతుర్థాంకము

### ప్రథమ రంగము—ఘటోదరి మందిరము.

[ ప్రవేశము: ఘటోదరి, కాళానలుఁడు, కొందఱు రాక్షసులు. ]



ఘటో—సోదరా! తొందరొందకుము. సర్వ మెఱింగించెదను. రక్కసులారా! నా యాజ్ఞప్రకారము మాంస సారాయములు సిద్ధముఁ జేసివచ్చితిరా!

రాక్ష—చిత్తము. మీయాజ్ఞప్రకారము మాంససారాయములు మిక్కుటముగ సిద్ధముజేసితిమి. ఏమిశెలవు?

ఘటో—నేడు మీకెల్లరకు పండుగఁ జేయదలంచి విందులకై మాంస సారాయములఁ దెప్పించితిని. ఇంక మీరతి శీఘ్రంబుగఁ జని మన రక్కసుల నెల్లరఁ దనివిదీర మాంసమును మెక్కి సారాయము గ్రోలునట్లా జ్ఞాపింపుడు. ఇదియ నాయాజ్ఞ. తీవ్రముగ పొండు.

రాక్ష—చిత్తము. శెలవు.

ఘటో—మంచిది. పొండు.

( రాక్షసులు నిష్క్రమింతురు )

తమ్ముడా వింటివే ? మోహిని యొక రాచకుమారునిఁ బెండ్లా డనెంచి యుద్యానమున లభించిన నతనిఁదెచ్చి తననివాసమం దుంచినది. అది నేను గ్రహించి యనేకవిధముల మందలించఁ దుదకు నిక్కముదెల్పినది. ఏమీ దానిమాయ ? ఐన మిగి నదేమిలే ? ఒకయుక్తిబన్నియే వచ్చితిని.

కాళా__ఏమది ?

ఘటో-ఏమియులేదు. నేఁడే మీకు వివాహ మొనర్పెదనని నమ్మ నటులఁ దెల్పి యాతని జంపుటకు గుర్తుగ నొక కడియము కాలికివేసితిని. అతఁడది యేలయని ప్రశ్నించునేమోయని యిట్లంటిని " మా కులవృత్తిరీతిగ నేఁడీ గండపెండేరమును నీకాలికి దొడగి నిను బెండ్లికొమరునిగఁ జేసెద"నని నమ్మించి యిట్లొనర్చితిని కాని నాకది మిగుల సందియముగనున్నయది.

కాళా_ఇంక నీకు సందియమేటికి ? అంతయు యుక్తియుక్తముగనే యుండినదిగదా ?

ఘటో-ఆ కడియముంగూర్చి మోహినికి గుట్టెల్ల జెప్పితిని. అందుచే నదియేమైన కార్యభంగ మొనర్పునేమొ యని శంకించు చుంటిని.

కాళా_అక్కా ! సందియమేల ? రక్కసుల నందఱ నాయత్తపరచి వారికిని వానికిని మత్తుగలునట్లుగను సందియము గలకుండు నట్లుగను జేసెదఁగాక శలవొసంగుము. పిమ్మట నీకత్తిచే వానికంఠము ద్రుంపుము. ఇదియే మనకు శ్రేయస్కరము.

ఘటో_మంచిది. అట్లనే జేసెద. నీవును రక్కసులం గలసి పరమా నందముగ నుండుము. పొమ్ము. నేనును బోయెదను. కార్య ము సిద్ధపగచెదను.

కాళా_మంచిది. రమ్ము పోవుదము.

(ఇరువురు నిష్క్రమింతురు)

## ద్వితీయరంగము—ఘటోదరీమందిరము లోభాగము.

[ప్రవేశము: కాళానలుఁడు, జగన్మోహనుఁడు, రక్కసులు] (పరుండి)

[ ప్రవేశము: మోహిని. ]

( అనుబంధము 21. )

ఔరా ! ఎంత మోసకారి ? నన్ను నమ్మించి చనువుగ నా గుట్టెఱింగి తుదకు నా ప్రాణకాంతుని జంపనెంచి కాలికి కడియమును గుర్తుగ వేసినదే ? ఏమీ దీని సాహసము ?— ఏమీ దీని దుండగము ?—కానిమ్ము. నే నిప్పుడీ రాజుమృదు పదంబునకు వేసియుండు నీయందెను కాళానలుని పాదమునకుం దొడగి యాతని నే మడియింపఁజేసెదగాక (వెదకుచు) హా ! ఎంతఘోర మొనర్చినది ! యొడలెఱింగియున్న నీ కార్యము సిద్ధింపదని సారాయమును ద్రావించి మత్తెక్కించినది. అబ్బా ! ఏమీ యీదుర్వాసన ? అందఱకట్లనే మత్తు గల్గినది, కారణమేమి ? ఔనౌను. సందియము గల్గకుండ నటుల నందఱఁ ద్రావించినది. ఇంక నాపని నేను గావించెద. (రాజు కాలి కాడియముందీసి) ఓ కుటిలాభరణమా ! ఇదివర కెందఱెందఱి ప్రాణములనో హరించియుంటివి. ఇందులకే నా నీ రూప మేర్పడినది ? నీవలనఁగదా యెందఱో మోసబోయి ప్రాణములఁ గోల్పోయిరి. ఇంక నేఁడు నీ వీ కాళానలుని దరికిం జేరి వానిం దిగమ్రింగి నీ యుదరము నిండించుకొనుము. (కాళానలుని కాలికిం దొడిగి) చాల తడవైనది ఘటోదరి యిచ్చటికి రాకముందే నా స్థానమున కేగెద. అదియు మత్తుచే నొడ లెఱుంగదే యున్నది. తన తమ్ముడని విచారించునంతటి శక్తిలో లేదు. ఆ రక్కసి నా యెడగల క్రోధముచే నయనములం దంగారకణముల రాల్చుచు వచ్చి విచారింపకయే కాలియందెను గుర్తించి వానినే ఖండించును.

అప్పటికి దానికిఁగల యుత్సాహ మడంగి విషాద మందగలదు మరియు నే నీ రాకుమారుని మేల్కొల్పి సర్వ మెఱింగించి ప్రాణము లుద్ధరించుకొనుట కెందులకైనఁ బొమ్మని యుపదేశించెద. (జగన్మోహనుని జేరి) రమణా ! లెమ్ము. లెమ్ము. నీ విచ్చటనుండి యెందైనఁజేరి ప్రాణము రక్షించుకొనుము. లేకున్న ఘటోదరి నిన్ను జంపివైచును. నేనును నీవెంటనే వచ్చెదనులెమ్ము. నీవు శీఘ్రముగఁ బొమ్ము. లెమ్ము లెమ్ము (చేయిబట్టి లేవదీయును.)

జగ—(కాలు చూచుకొని) ప్రేయసీ ! నా గండపెండేరమేది ?

మోహి-అయ్యో ; పిచ్చిరాజా ! అంతయు పిమ్మట దెల్పెదను. నీ వెందైన పారిపొమ్ము. రక్కసి యిందు వచ్చువేళ సమీపించినది. అదివచ్చిన ప్రాణము లుద్ధరించుకొనుట దుర్ఘటము. ఇంక నీవిం దుండవలదయ్యా వలదు.

జగ—అట్లైన నే నేగెదను నీవు శీఘ్రంబున వచ్చి నన్నుం గలసికొందువా ? నన్నంపి నీవిందేయుండెదవా ?

మోహి-నేవచ్చెదను నీవేగుము.

జగ—శీఘ్రముగ రమ్ము. (నిష్క్రమించును)

మోహి-అమ్మయ్య ! ఇప్పటికి ప్రియుని ప్రాణ ముద్ధరించితిని యింక నాగతియెట్లు ?—నేనెట్లు తప్పించుకొందును ?—ఐన ప్రయత్నించిచూచెద. ఇంక జాగుసేయక ఘటోదరిచెంత కరిగి విషయములం దెలసికొని మార్గము బట్టెదగాక.

(తెరలో) (నిష్క్రమించును)

[ ప్రవేశము: ఘటోదరి ] (ఖడ్గము చేఁబూని)

( అనుబంధము 22 )

(చూచి) ఈరక్కసు లెల్లగు సారాయము గ్రోలుటచేతనోడ లెఱుంగక మత్తుచేఁ బరుండిరి. ఇందా రాచకుమారుఁడగు

నా వైరిసైతము గలఁడు. వాఁడెందుండెనో దిలకించవలయు. (వెదకుచు) నడురేయి యగుటచే యంధకారము కన్నులకుం గప్పి నేమియు దృగ్గోచరము గాకున్నది. యీ కాళరాత్రి యందెట్లు గుర్తింతును ? తెలసినది. హానిపాదమునకు మరణ చిహ్నమునకై యొకయందె వేసితినిగదా ? వెదకిచూచెదఁ గాక. (వెదకుచు కోపమున) ఓరీ ! రాజకులాధమా ! నేఁడీ ఘటోదరి యను కాలసర్పము కాటందుచున్నదంది. ఈ కాటుచే నీకు మరణము సిద్ధము, దురాత్మా ! ఘటోదరి యని నన్నెఱుంగవా?—నన్ను సామాన్యముగ నెంచితివా?— నీబాబులవంటివాండ్ర సాధించి వేధించి సంహరించి వాండ్ర మాంసశకలముల నెల్ల వండించి జిహ్వాకురుచిగ దిండితిని యుంటిని నీవనఁగ నెంత ? నంబారింగడ్డ స్త్రీ పురుషు లెవ్వరైనఁ బ్రాణములతో మనియుండిరా ?—ఖడ్గరాజమా ! ఇక శాంతినొందకుము—రాజుగదాయని శంకింపకుము— నాయాజ్ఞోల్లంఘన మొనర్పకుము—నీకఱకుఁదనమునుఁ జూపుము—రక్తధారచే నాకన్నులకు విందొనఁగుము—ఇంక జాగొనరింపకుము. (కత్తి జళిపించుచు)

( అనుబంధము 23 )

ఇదే నాచే జచ్చితివిగదరా తుచ్ఛ ! ఇంకెందేగెదవు ?

(కాళానలుని కంఠము నఱకును)

కాళా—అక్కా......చ......చ్చి........:—

ఘటో-(చూచి) హా ! తమ్ముడా ! ఎంత దుర్మార్గరాలను ? నిన్ను బట్టి నీచుఁడగు రాకొమరుఁడుగదాయని గుర్తింపనేరక నరు వగా గొంతుకోసిన దుర్మార్గురాలను.— పాపురాలను. — హా! సోదరా ! నాకింక గతియెయ్యది ?

గీ॥ చేతులారంగ తమ్ముండా! ♦ చెనటినగుచు
జంపియుంటిని నేఁడు నీ ♦ కొంపమునుంచి
తేమి జేయుదు? నాగతి ♦ యెట్టులగునో?
(కోపమున కత్తిదిప్పుచు)
క్రూరుఁడౌ భూపునింబట్టి ♦ గొంతుఁగోసి
కసినిఁ దీర్చుకొనెద, నాదు ♦ కత్తిచేత.—

ఓరీ! రాజకులాధమా! ఎందుంటివిరా? (వెదకుచు) నిన్ని ప్పుడే ఖండించి చప్పరించి మ్రింగెద. (వెదకినిలచి) ఔరా! ఏమీ మోహినిమాయ! వాని నెందోబంపి ప్రాణము లుద్ధరించినట్లున్నది. కాన్పింపకున్నవాఁడే? కానిమ్ము. వాడెం దుండినను బట్టి చంపెదగాక. నా కోపాగ్ని చలార్చుకొందు గాక.

( అనుబంధము 24. )

(నిష్క్రమించును)

యవనికజారును.

---

# తారాచంద్రీయము.

## వెల రు 0-14-0



శ్రీ

# జగన్మోహన

## పంచమాంకము.

### ప్రథమరంగము—వీరసేను నాస్థానము.

[ప్రవేశము: వీరసేనుఁడు, సోదరులు] (విషాదమున

వీర—సీ॥ చిన్నారిపుత్త్రినే • చెన్నడుగందునో!
కన్నులారంగ ని • న్గన్నతల్లి!
తల్లిదండ్రులఁ బాసి • యుల్లమందున నెట్లు
గాఁదల్లడిల్లితో? • గన్నతల్లి!
అనుఁగుచెలులఁ బాసి • మనసెట్టులొప్పెనో!
కనుమూయునంతలో • గన్నతల్లి!
పసులెవ్వరైనఁ జే • పట్టిరో క్రూరమృ
గంబులు మ్రింగెనో! • కన్నతల్లి!

గీ॥ కటకటా! నెప్డుగాంతునో • కన్నతల్లి!
నిన్ను నెడబాసిమనియుంటిఁ • గన్నతల్లి!
కరుణవిడనాడి ననువీడి • కన్నతల్లి!
కన్నవియఁజేసి పోయితే • కన్నతల్లి.—

హా ! సోదరులారా ! ఇంతకాలమునుండి వెదకినను యతుం
గుపుత్రిజాడ దెలియదయ్యె. ఇంక నేమిసేయుదును ? ముద్దు
బిడ్డను బాసినదాది నిద్రాహారంబులు లేక చపలచిత్తుండనై
జీవచ్ఛవమ్మురీతి నుంటినిగదా ? అయ్యో ! గ్రహాచారమా !

1—అగ్రజా ! చింతింపకుండు. ఇంకను వెదకింతము.

2—దేవా ! అంతయు విధికృతము. వగవకుండు.

3—కుంభినీశా ! యూరడిల్లుండు దుఃఖించిన ఫలమేమి ?

4—అన్నగారూ ! శాంతించుండు. ఇంకను సాధ్యమైనట్టుల న్వేష ణార్థమై మరల తగువారలం బంపుదము.

5—అగ్రజా ! వగవకుండు. బిడ్డ యెందుండినది విచారించెదము. ఇగదలు సోదరులుండ మీకేమి కొఱంత ?

వీర—అన్నలారా ! ఏ కొఱంతయు లేక నన్నన్నోవిధముల మన్నన గ బ్రోచుచు సోదరవాత్సల్యముంచినది నే నెఱుంగనా ? ఎంత యైశ్వర్యమున్నను—ఎంత గౌరవము జూపినను ముద్దు బిడ్డ లేకుండుటచే అంతయు గగనకుసుమమట్లు శూన్యమై గన్పట్టుచున్నది. నా కేమియుం దోచుటలేదు. ఇంక నే మనంజాల.

(తెరలో)

వీరసేన రాజేంద్రా ! శరణు ! శరణు ! రక్షింపుము.

వీర—సోదరులారా ! ఎవ్వరీ దీనాలాపంబు లాడువారు ?

[ ప్రవేశము: జగన్మోహనుండు ] (పర్వున)

(వీరసేనుని పదములపైంబడి) రాజచంద్రమా ! ప్రాణదాన మొసంగి రక్షింపుము ! రక్షింపుము ! !

వీర—ఓయీ ! భీతిల్లకు. శరణంటివి రక్షించెదదాక. (వీపు చఱచుచు) ఓయీ. నీ చిహ్నములెంచ రాచబిడ్డవుగ నున్నాడవె నీ కెవనివలన ముప్పు చేకూరినది ? ఎందుకై శరణంటివి ?

నీ చారిత్రమంతయు నిజముగ్గడింపుము. ఇందుఁగూర్చుండుము.

(జగన్మోహనుఁడు కూర్చుండును)

[ ప్రవేశము: ఘటోదరి ] (బాలింతవేషమున బిడ్డనెత్తుకొని)

(స్వ) ఇదియే మంచి సమయము. ఇత్తరియే వీనినిఁ బట్ట వలయు. (ప్ర) మహారాజా! రక్షింపుము! రక్షింపుము!

( అనుబంధము 25. )

వీర—అమ్మా! భయమందకుము. రక్షించెదఁగాక నీవెవ్వరిదానవు? నీకెవ్వనిచే యాపద సంభవించినది? సత్యముఁ జెప్పుము.

ఘటో—అయ్యా! చిత్తగింపుఁడు. ఈయన నా ప్రాణకాంతుఁడు దుర్వ్యాప్తియందుఁ బ్రవేసించి నన్నును యీ పసికూనను విడనాడి యెందో బోయెదనని పయనమై వచ్చుచున్నవాఁడు. ఎట్లైన నా నాథుని దుర్వ్యాప్తిమాన్పి నావశ మొనర్చి నా కాపురముఁ గూడఁగట్టుడు. లేకున్న నేనెందైన దుమికి ప్రాణ పరిత్యాగ మొనర్చుకొందును. అందుచే స్త్రీహత్యా దోషము సంభవించి మిమ్ము పీడించును.

వీర—అమ్మా! స్త్రీహత్యఁగూడఁ బ్రాప్తింపఁజేసెదవా? శాంతిం చుము. నీనాథుని విచారించెదగాక. రాజకుమారా! ఏమిది? ఇట్లాచరింప భూపతులకుఁ దగునా?—సరివారు విన్న యప కీర్తిరాదా?—యశస్సుబోదా?—"నావిష్ణుః పృథివీపతిః" యను సనాతనధర్మ మెఱుంగవా?—ఇట్లుండిన ప్రజలు ప్రభు వులయెడ భక్తిఁగల్గి మెలంగెదరా?—ప్రాణకాంతను నిష్కా రణముగ వీడుట యఘంబుగాదా?—

జగ—అయ్యా రాజచంద్రమా! ఇది నిక్కముగ నా భార్యగాదు. నన్నుజంప వెన్నంటివచ్చిన రక్కసి దీనిపల్కులేల విశ్వసించె దరు?

ఘటో—తండ్రీ ! అన్యకాంతాలోలుఁడై నాయెడఁ బ్రియము జూపక యుంపుడుగత్తెయే తన ప్రాణమనియెంచి దానినిఁ బ్రేమించి నన్నీ కడగండ్లముంచుచున్నాఁడు.

వీర—భూనాయకా ! అసత్యముగూడఁ బల్కుటనేర్చితివా ?

జగ—అయ్యా ! నే నుగ్గడించిన వచనంబులెవ్వియు నసత్యములు గావు. ఈరక్కసి వచించినవెల్లకల్ల. ఇది నాభార్యగాదు నాపాల మృత్యుదేవత. నాకాంత నా నిజనివాసమందే యుండినది. నే నన్యకాంతాలోలుఁ డనైతినని మీరునమ్ముటకై వచించినది గాని ఇదియంతయు యదార్థము గాఁజాలదు—

ఘటో—అయ్యా ! ఇతఁడు నాభర్తయేగాకుండిన నేనిట్లురానేల ! పరకాంత లెందైనఁ బురుషులవెంట నంటి యిట్లు వత్తురా ? మీరింకను నమ్మకున్న యీబిడ్డ ముఖవికాసముగాంచి తండ్రి పోల్కియున్నదియు లేనిదియు మీరే గ్రహించఁగలరు. ఇదుగో ! బుడుతఁడు దిలకింపుఁడు. ( చూపుచు ) అన్నా ? మీ నాన్న యేడి చూపుము ? ( తన చేయిచాటుగ కుఱ్ఱని చేయి చేచరాపించును ) తండ్రీ ! చూచితివా ? నేఁ జెప్పుటయగాక నోరెఱుంగని పసికూనగూడ తండ్రినిఁజూపుచున్నాఁడు చూచితిరిగదా? ఇంక సత్యాసత్యములెవ్వరు బల్కిరో విచారింపుడు.

వీర—ఆర్యా ! ఇదంతయు చిత్రముగనున్నది. "ఔనని" ఆబిడయు "కాదని" నీవును బల్కుచుండిరి. ఇందు సత్యము దీయవలయునన్న కాలయాపనమగునుగాన:—

జగ—దేవా ! మీకును నన్ను జంపఁదలంపే గల్గినదా ! రక్కసులు మాయలమారులగుటచేతను కామరూపులగుటచేతను వారు ధరింపరాని రూపముండదు. మరియు నాకింక సంతానమే కల్గలేదే ఇదెట్లు నమ్మెదరు ?

ఘటో—అయ్యో ! తండ్రీ ! ఎట్లైనఁ దప్పించుకొని పారిపోవనెంచి యీ పన్నుగడఁ బన్నుచున్నవాఁడు. బిడ్డా ! మీనాయన యీయనకాడా ? ( గడ్డముఁబట్టి తలత్రిప్పును ) అయ్యా !

జగమెరుంగని పసిపాపడే జెప్పుచున్నవాఁడు ఇంతైన నమ్మ
రాదా ? ఎట్లో నాకాపురముగూడఁగట్టఁ బ్రార్థించెదను.

వీర—సోదరులారా ! వీరినిఁగూర్చి విచారింప నేమియుం దోచుట లేదు. ఎల్లి సూర్యోదయంబున విచారించెదగాక. నీరేయి వీరి నిర్వుర నొక్కగదియందుంచుఁడు.

1, 2, 3, 4.—చిత్తము.

జగ—

ఉ. ధీరవరేణ్య! మ్రొక్కెదను ♦ దీనుని ప్రార్థనలాలకించి యీ
తీరున నాజ్ఞనీయక య ♦ దీనినికీ వెసఁ బారఁదోలగా
గోరెదమిమ్ము, భూపమది ♦ గొంకక రక్కసి నన్నుఁ జంపనీ
తీరున వచ్చెఁ జూడ, భవ ♦ దీయకృపారసముంచి ప్రోవ మీ.—

కుంభినీధవా ! నావిన్నపమాలకింపుఁడు. ఈరక్కసిని నెంతైన వేరుగ నుంచుఁడు. లేకున్న మీవలనని రేయి నాకు మరణము సిద్ధము పైని మీదయ.

ఘటో—రాజేంద్రా ! ఈతఁడు మాంత్రికుఁడు—కపటవేషధారి—బహుమాయకుఁడు. ఎట్లైన నీరేయి నన్ను మీచేతవీఁడి పలాయితుం డగుటకు యత్నించి యీ యుక్తిఁ బన్నినాఁడు గాన దేవరవారి శలవురీతిగ నీరేయి మమ్మిరువుర నొక్కగదియందే యుంచుఁడు. ఎల్లి మీ యాజ్ఞానుసారఁబుగ విమర్శించెదరు గాక. అట్లుగాక మమ్ము వేరుపరచిన నీతం డేమార్గముననో బోవును. అప్పుడు నాకుఁగల్గిన ప్రియవియోగమునకు మీరే కర్తలు. దాంపత్యమును బాపినఫల మనుభవింతురు గాన మీ యానతిరీతిగ నీరేయి నొక్కచోటనే యుంచుఁడు.

వీర—(స్వ) వీరి చరిత్రముంజూడ "ముందునుయ్యి వెనుక గొయ్యి" వలె నేమియుం దోపక సంకటమొందవలసి వచ్చినదే ? (ప్ర) రాజకుమారా ! భీతినొందక నీరేయి నెట్లులో నీమెయును నీవును నే నిర్ణయించిన గృహమందు వసింపుఁడు. రేపు నిజానిజములు విచారించెదఁగాక.

జగ—అయ్యా ! విచారింపవలసిన యగత్యమే యుండదు.

వీర—కారణము ?

జగ—నే జీవించినంగదా మీ విచారణ ?

వీర—ఓయీ ! ఏమీ నీవెడగుదనము ? నిక్కముగ నీ ప్రాణమునకు నా ప్రాణ మొసంగెదను. చింతిలక పొమ్ము.

జగ—అయ్యా ! మీ యాజ్ఞకు తిరుగులేదా ? మనవి.

రా గా వ తా ర సీ స ము.

జగ—

మోహనాకారిణి ♦ మోసంపు మాటలు
నమ్మునట్లుగఁ జెప్పె ♦ నయ్య జుమ్ము
కన్నడమానినన్ ♦ గాచి రక్షించుము
శరణంటి ధారుణీ ♦ శ్వర ! నిజమ్ము
భైరవీపతిసాక్షి ♦ ప్రాణదీయంగఁబూని
వచ్చినరాక్షస ♦ వనితజుమ్ము
భూపాలచంద్ర ! నీ ♦ ప్రాపుఁజేరినవాఁడ
నీటపాలనుముంచ ♦ నీవె జుమ్ము

గీ॥ భూరికళ్యాణుడంచు నీ ♦ బురజనమ్ము
స్తవ మొనర్చుచునుండ్రు నీ ♦ సద్గుణమ్ము
ఇట్టి చిత్రంబు జరుగునం ♦ చెరుగఁజుమ్ము
అయ్యదేవా ! మీదగతియెట్లు ♦ లోనుజుమ్ము.—

గీ॥ వెడలుచున్నాఁడ మీయాజ్ఞ ♦ విడువలేక
రక్కసికి వాంఛదీర్పంగా ♦ రాముబలిని
యిచ్చియున్నార లీరింక ♦ నిచ్చతోడ
బోవుచున్నాడ యమపురి ♦ భూపతీంద్ర.—

సీ॥ కరము రేబవలులు ♦ గాలంబుజరుపుచు
సర్వమారయు సూర్య ♦ చంద్రులార !
దివమందుగన రాక ♦ జవమున గాతిరి
నిక్కముగనుపించు ♦ చుక్కలార !
మీరకుండజగంబు ♦ తీరుగా నడిపించి
గ్రాలుచుండిన నవ ♦ గ్రహములార !
సకలజనాళికి ♦ సౌఖ్యమొసంగి చాల
గరుణించు భూనభః ♦ కాంతలార !

గీ॥ రక్కసిట్టులు ననుజంప ♦ నిక్కువముగ
వచ్చిబొంకుట లెఱుంగరే ? ♦ నిశ్చయముగ
మీర లెల్లరు బ్రోవు డ ♦ మేయమతిని
గోరి మ్రొక్కెద వేడెద ♦ గొనుఁడు మనవి.—

వీర.—అయ్యా ! భీతిల్లకుఁడు. సోదరులారా ! వీరి నిరువుర నీ రేయి భద్రముగనుంచి తగువాండ్ర గా నలుంచుఁడు.

1, 2, 3- చిత్తము.

ఘటో-(స్వ) ఇప్పటికి నాకోర్కెఁ దీరినది. ఈ రేయి నొక్క క్షణములో వీని సంహరించి నాకసిఁ దీర్చుకొనియెద.

1, 2, 3-అయ్యా ! రండు పోవుదము.

జగ—చిత్తము.

( అనుబంధము 26 )

( 1, 2, 3. జగ, ఘటో నిష్క్రమింతురు )

వీర—గీ. (స్వ) ఎట్టివార్తను విందున ♦ దేమొ రేపి
కేమి దోపకనిటుఁజేసి ♦ తీడ వీని
భార్యగాకున్న నీతఁడు ♦ ప్రాణములను
బాయు, రక్కసిచేనిల ♦ బాపమకట.—

హా! దైవమా! ఈతని జీవితమెట్లుగానున్నదో గదా! పుత్రికా వియోగముచే నేమియుం దోపక నిట్లాజ్ఞాపించితివి. దైవమా! సర్వమునకు నీవేభారకర్తవు. ఏమిసేయ నెంచితివి?

( యవనిక జారును )

( ప్రవేశము: ఒక పౌరుఁడు )

పాపము వీరసేన రాజేంద్రుఁడొక రాజునకును నాతని భార్య కుం గలిగిన వివాదము దీర్పనెంచి "రేపుదయము దీర్చెదనని రేయి నొకయింట నుండు" మని యాజ్ఞ నిచ్చి రాత్రి వారి నిరువుర నొక గృహామందుంచిరట. ఆ స్త్రీ పాపమాతని భార్యగాదట. "తన్ను జంపవచ్చిన రక్కసి" యనియుఁ దాని చెంత నన్నుంచవలదనియుఁ జెప్పుచు ననేక విధములఁ బ్రార్థించెనట. అదియెల్ల రాజు పెడచెవినిం బెట్టి వినక నతని యాజ్ఞానుసారము జరుపుటచేత ఆ స్త్రీ రూపధారియగు రక్కసి యర్ధరాత్రమున నారాజకుమారునిఁ దెగటార్చి రివ్వున మిన్నునకెగసి కేకలు వేయుచుపోయెనట. అయ్యో! ఎంత ఘోరము?— ఎంతపాపము?— ఎంతదారుణము?— ఈ వార్త తెల్లవారకమునుపే పట్టణమంతయు వ్యాపించినది ఒక్క పట్టణమేమి? దేశమంతయుఁ బ్రాకినది. కట్టా! ఏమీ రాజుల పరిపాలనము? నిక్కము విచారింపరుగదా? శక్తి స్వరూపిణియగు నా స్త్రీ మాయపల్కుల నే విశ్వసించెను. కనుకనే రాజులకు కర్ణములే కన్నులనియు కన్నులు సున్నలని యు పెద్దలు చెప్పుకొందురు. దురాత్ములగు నిట్టి స్త్రీలకతన నేలోకమంతయు నాశనమగుచున్నది. ఔరా! ఏమి తుచ్ఛ లగు స్త్రీలమర్మములు?— ఆహా! ఆరాచకుమారుఁడు నెం దుంచిరో పోయి చూచెదగాక.

( నిష్క్రమించును )

రంగము—రాజవీధి.

[ ప్రవేశము: ఇద్దరు బ్రాహ్మణులు. ]



1 బ్రా-అయ్యా! నీప్రయాణ మెచ్చటికి? చాల దూరమునుండి వచ్చుచున్నట్లున్నది.

2 బ్రా-ఔను! ఇచటికేవచ్చితిని. మీ రెచ్చటికేగెదరు?

1 బ్రా-మాదీపట్టణమే. ఊరక రాజవీధిని బోవుచుంటిని ఏమైన విశేషములున్న దెలియునని.

2 బ్రా-ఈపట్టణమున జరిగిన విశేషములు మీకుఁ దెలియలేదా?

1 బ్రా-తెలియలేదు. మీ రెఱింగిన దెల్పుఁడు వినవేడెద.

2 బ్రా-(అటునిటుచూచి) ఎవరు లేరుగదా. మీ రాజుగా రెవరినో బలాత్కారముగ నొక స్త్రీచే జం......:—

( నోరు మూసుకొనును )

1 బ్రా-ఏమయ్యా! సాంతముగ జెప్పక నోరుమూసికొందువు?

2 బ్రా-ఈ వార్త నిజమో అబద్ధమోనని వెనుకాడుచుంటిని.

1 బ్రా-నిజమేనని జనులనుకొన అదేజూడ నేనును బయలుదేరినాఁడ.

2 బ్రా-ఏల యీ డాంబికపుమాటలు? నేఁడతనికి ప్రేతసంస్కార మాచరింతురటగదా? నిజమేనా? మీ రచ్చటికే పయనమట్లున్నది.

1 బ్రా-ఔను. నీవును నచ్చటికే వచ్చెదవా?

2 బ్రా-ఇంకెచ్చటికనుకొంటివి? ఎంతో దూరదేశమునుండి పెద్దయాశతో నిచ్చటి కేగుదెంచితిని. ఏమైన రాజు చెయ్యిజార నిచ్చునా?

1 బ్రా-మననోరుజారిన వారిచెయ్యి వెంటనే జారును. విచారణయేల?

2 బ్రా-కాదయ్యా ! సంస్కార మాచరించువపుడు దానములిత్తురు గదా ? అది నే ననునది.

1 బ్రా-పోవుచుంటిమిగదా ? ఇంతలో నింత తొందరేల ? అచట తెలియదా ?

2 బ్రా-బ్రాహ్మణుల కైన లాభమే ?

గీ॥ చచ్చివను పుట్టినను గాని ♦ సరసముగను
భూసురుల పంటబండు నీ ♦ పుడమియందు
బ్రాహ్మణులకన్న నెక్కుడు ♦ వారలెవరు ?
పుట్టినను బ్రాహ్మణునియింటఁ ♦ బుట్టవలయు.—

1 బ్రా-ఏమిఁలాభము ?

2 బ్రా- గీ॥ వచ్చిపోయిన పత్తరల్ ♦ వచ్చుజుమ్ము
బ్రదికినను శుభకార్య ♦ పద్ధతులను
దక్షిణలు తండులీయముల్ ♦ ధరణీసురుల
కిచ్చుచుందురందరు భువి ♦ నిచ్చదీర
పుట్టినను బ్రాహ్మణునియింటఁ ♦ బుట్టవలయు.—

గ్రామములో చచ్చినను లాభమే. పుట్టినను లాభమే. శుభమైన లాభమే. యశుభమైన లాభమే. వేయేల యెట్లైనను మన మామూలు పత్తర తప్పదుగదా ?

1 బ్రా-ఎంతవాడవయ్యా ! ఎంతయూహ గలదయ్యా ! ఇంక తీవ్రముగరమ్ము దూరదేశమునుండి వచ్చితిరి. అచట కార్యాంతమైన మనకు నిస్సారమగును. రమ్ము.

(నిష్క్రమింతురు.)



## ద్వితీయరంగము—వీరసేనుని యంగణము

[ ప్రవేశము: వీరసేనుఁడు, తమ్ములు ] ( విషాదమున )

వీర—సోదరులార ! ఎంతమూర్ఖుడను ?—ఎంత పాపుఁడను?

చం॥ బలిమినిఁబట్టి చంపితిని ♦ ఘాతము సంభవమాయె నక్కటా !
చెలియనినమ్మి రక్కసినిఁ ♦ జేర్చితి రాముతుతోడనెంచక౯
బాలియగఁజేసెనాకు మతి ♦ భూపకుమారుని నేమిసేయు దీ
కలియుగమందు దుర్యశము ♦ గల్గెగదా? యిక నేమిసేయుదు౯.—

అయ్యో ! నేనెంతపాపాత్ముఁడను ?—ఎంతకఠినాత్ముఁడను ? అక్కటా ! మాయవేషధారిణియగు రక్కసి మాటల నిజమని యెంచి సచ్ఛీలుఁడును—రూపవంతుఁడును—యౌవనవంతుఁడును—భీతావహుండునై వచ్చిశరణుఁజొచ్చిన రాకుమారుని జాలివాక్యములాలించక పోయితినే ? కటకటా ! నారాకూనను వేరుగనుంచిన నాతఁడు మనియుండునుఁగదా ? క్రూరకర్మమొనర్చితిని—కులనాశనము జేసితిని— ( రక్కసినుద్దేసించి ) ఓసీఘాతకీ ! నీవు మృత్యుదేవతవని యెఱుఁగనైతినే ?—మహామారివనితలంపనైతినే ? రాకుమారుని జక్కడంచవచ్చిన రక్కసివని యెంచనైతినే ?—హా ! పాపినీ ! యకారణంబుగ సదయహృదయుఁడును. శాంత స్వభావుఁడునగు భూకాంతుని చేతులారఁ నీకు బలియొసంగితినే !—అయ్యో ! మిమ్మిరువుర నొక గృహమందుంచునట్టి మౌఢ్యము నాకేల జనించినది ? హా ! భూనేతా ! నేనును నీవెంటపయనమై వచ్చుచున్నాఁడను. నన్నునైతమునీలోఁ గలుపుకొనుము. సోదరులారా ! యువభూపాలునిఁ బలిమినిజంపించిన నేనింక మనియుండనేల ? నేనును వానిననుసరించెద.

1 — అగ్రజా ! ఇంత తెగువఁదగునా ? కాలముఁ దీరినవా రెల్లరుఁ జచ్చుట మీ రెరుంగరా ? ' తనువులు స్థిరములుగావనియు.

ఎండమావులలోని జలంబులరీతిగ చిత్ర విచిత్ర చర్యలతో నీ ప్రపంచనటన జరుగుచుండె ' ననియు పలుమారు మాకు బోధించుచుండిరే ? ఇట్టి ధైర్యశాలులగు మీరిట్లు బేలరీతిగ నుగ్గడించ మేమేమి నుడువగలము ? సర్వమెఱింగిన మీరిట్లు చింతనొందదగునా !

వీర — సోదరులారా ! ఈ రాజునకు ప్రాణాపకారమొనరిన " నీ ప్రాణములకు నాప్రాణ మొసగెద "నని బల్కియుండినాఁడ, ఇప్పు డిందులకు తప్పిచరించిన లోకులచేఁ బడరాని నిందల పాలగుదును. ఛీ ! నేనింక జీవించియుండుటకన్నఁ జచ్చుట యే శ్రేయము. సోదరులారా ! మీరింకఁజని యా భూకాంతున కగ్నిసంస్కార మాచరింపఁదగు యత్నము లొనర్పుఁడు నే నాతనితోడ సహగమన మొనరింతును. ఇంక జాగొన రింపక పొండు.

2 — అగ్రజా ! ఇట్టి ఘోరకార్యమున కెట్లు సాహసింతుము ? మరియు:—

వీర — తమ్ములారా ! నా యాజ్ఞమీరి జరించెదరా ? ఇది రాజాజ్ఞ గదా ? ఇందులకు మారుబల్కరాదు.

1,2,3,4 — చిత్తము. అట్లనే యొనర్తుము.

(నిష్క్రమింతురు)

వీర — [స్వ] హా ! ఎట్టిగతి చేకూరినది ? దైవమా ! నా పాపమున కంతు లేకుండఁ జేసితివిగదా ? నాయట్టి పాపుఁ డీలోకమున నుండియేల ? హా ! లోకనాథా ! (మూర్ఛిల్లును)

యవనిక జారును



## తృతీయరంగము—అడవి—మండుచున్న కాష్ఠము.

[ ప్రవేశము: వీరసేనుఁడు ] (విషాదమున ఇరువైపుల)

ఉ॥ పావకనిన్నుఁ జేరమది ♦ ప్రార్థనసల్పుచునుంటినయ్య ! నీ
భావమునందు వేరుగను ♦ బాపుఁడవంచని యెంచకయ్య ! యా
పావకుడిందు సాక్షిగను ♦ భస్మమగున్నటుజేయుమయ్య! నళ్
ద్రోహమలంచుఁ గోరితిని ♦ బొంపిరి నిశ్చలబుద్ధి నిల్పితిన్.—
ఇంకఁ జాగొనరింపక కృశానునిఁ జేరెదను.

అగ్నిలో దుముకఁ బ్రయత్నించును.

[ ప్రవేశము: మోహిని, మాండవీదేవి. ] (విషాదమున) ఇరువైపుల

( అనుబంధము 27. )

మోహి— గీ॥ అయ్యో ! నన్నిట్లుబాసి రవ్వంతలోన
చితిని జొరనెంచితీవు నాగ తియదేమి ?
మాండ— యేనుసేతను మీతోడ ♦ నేగుదాన
సత్యమీమాట మీపద ♦ సాక్షి ! నేఁడు.—
(వీరసేనుఁడు నివ్వెరపాటునఁ జూచుచుండును)

మాండ-ఓ జనార్దనా ! నాకింక పతిభిక్ష పెట్టుము. లేకున్న నేనీ కృశానునిఁజేర నిశ్చయించియుంటిని. ఆపద్బాంధవా ! మాధవా ! సత్యభామాధవా !

సీ॥ శరణన్న ద్రౌపదిన్ ♦ సరగునఁ గని నీవు
వలువ లొసఁగినట్టి ♦ వార్త లేదె ?
శరణన్న మౌనుల ♦ సమితినిబ్రోవఁద
లంచి, రక్కసులను ♦ ద్రుంచ లేదె ?
కరిరాజు మొఱలిడఁ ♦ బరుగున జనుదెంచి
దుముకుచు మొసలిని ♦ దునుమ లేదె ?

దాక్షిణ్యమొగి లేకఁ ♦ దండ్రి బెట్టిన కష్ట
ములఁ గాంచి ప్రహ్లాదుఁ ♦ బ్రోవ లేదె ?
గీ॥ యార్తునై నిన్ను ధ్యానింతు ♦ నబ్జనేత్ర !
యస్మదీయ దుఃఖము బాపు ♦ మయ్య ! కృష్ణ !
మాకు పతిభిక్ష పెట్టుమ ♦ శోకమతిని
వేడుచుంటిమి నిన్నిదే ♦ వేయుగతులఁ.—

మోహి-ఓ పరమేశా ! రమేశా ! జగదీశా !

సీ॥ కరిరాజ సంరక్ష ! కౌస్తుభమణివక్ష !
పాండవపక్ష ! గర్వారిపుశిక్ష !
భక్తజనోద్ధార ! పరమార్థ సంచార !
హరి ! మోహనాకార ! యఘవిదూర !
మునిజనమందార ! కనకవసనధార !
మా మనోహర ! హేమగిరిధీర !
నీలనీరదగాత్ర ! నీరజదళనేత్ర !
క్రూరదానవజైత్ర ! కుతలమిత్ర !
గీ॥ నందగోపాల ! శృతిజాల ! బృందలోల !
సాధుజనపాల ! మృదుఫాల ! సత్యశీల !
కరుణతోఁ గాంతు బ్రోవవే ! ఘనకపోల !
కోరి మ్రొక్కితి నీవేళ ! గోపబాల !

( అనుబంధము 28 )

[ ప్రవేశము: విష్ణుమూర్తి ]

ఇందుముఖులారా ! మీ భక్తి కెంతయు మెచ్చితిని. మీ పాతి వ్రత్యమునకు సంతసించితిని. నాసేవాభాగ్యము మీకబ్బుటచే మిగుల ధన్యులైరి. కృతార్థులైరి. నారీమణులారా ! మీ కెద్దియేని వరంబువలయునన్న గోరుఁడు మీకది సిద్ధింపఁ జేసెద.

మాండ-లక్ష్మీవల్లభా! సచ్చిదానంద తేజమగు నీదర్శనముచేఁ గృతార్థులమైతిమి. ధన్యులమైతిమి. దేవా! నీవు వాచామగోచరుండవు—నిర్వికల్పుండవు—నిష్కళంకుండవుఅవ్యయుండవు—ఆదిపూరుషుండవగు నీదర్శనభాగ్యమే మాకు వైకుంఠము. సర్వేశా! వేదాంతవేద్యా! ప్రాణకాంతుని గోల్పోయి కడుఁవిషాద సముద్రంబున మునుఁగుటకు సిద్ధముగనున్న మమ్ముద్ధరించి పతిభిక్షఁబెట్టి యీదుఃఖార్ణవమునుండి గట్టు వట్టింపుము. లేకున్న మత్ప్రాణకాంతునితో సహాగమన మొనర్ప కృతనిశ్చయులమైయుంటిమి. నాథులులేని యనాథల రక్షించు పురాణపూరుషుండవని నీరూపునామము లెదనిల్పి ధ్యానించుచున్నారము. సచ్చిదానందమూర్తివగు నీవు దీనురాండ్ర మొరలాలించి పతిభిక్షపెట్టుము. (నమస్కరించును)

విష్ణు—అబలలారా! విషాదమందకుఁడు. మీమానసములు దుఃఖాగ్నియందు ప్రమగ్నఁజేయకుఁడు.

మోహి-మాధవా! సత్యభామాధవా! నీపవిత్రచరిత్ర నామోచ్చారణచేత నేగదా? సకల బృందారకాది బృందముల యీప్సితంబులీడేర్పుటలు? యీలోకంబున భక్తరక్షకుండవు నీదక్క నెవ్వరుండిరి? మానినీ సంరక్షణమునకై—డింభకప్రాణ రక్షణమునకై—కరిరాజ సంరక్షణమునకై—పాండవ ప్రాణ రక్షణమునకై నీవుగదా వెడలి వారల నుద్ధరించినది? కృష్ణా! వైకుంఠవాసా! కాంతునిఁ గోల్పోయి స్వాంతము చింతకు జిక్కి గాసిలుచున్న మమ్ముద్ధరించి నీదాసుని ప్రాణదాన మొసంగి మా సూత్రముల నిల్పుము. భక్తజనావనా! ఎనలేని క్షోభమందుచుంటిమి—నిపదకమలములఁ గొల్చుచుంటిమి.—నాథుని జీవితునిఁజేయ వేఁడుచుంటిమి—లేకున్న మమ్మునైనను నీ చక్రప్రయోగముచే హతముజేసి మా దుఃఖముఁబాపుమని వేఁడుచుంటిమి. (నమస్కరింతురు)

వీర—దేవా ! రక్షింపు. మందమతినై—అజ్ఞానుండనై—యీ రా
కొమరుం డుగ్గడించిన వచనంబులు విశ్వసింపక మూర్ఖచిత్తుం
డనై చేతులార నొకరక్కసి కీతని బలియొసంగిన పాపుఁడ—
నీచుఁడ—దుష్టుఁడనగు నన్నుఁ గృతార్థునిఁ జేయ నీ పురంధ్రీ
మతల్లుల కరుణచే భవద్దర్శనమబ్బె. దేవా ! నిరంతరము నీ
పదధ్యానుండ నగు నీ దాసుని ప్రార్థన లాలించి యీ కుంభి
నీధవుని పునర్జీవితునిఁ జేసి యీ సాధ్వీమతల్లుల సూత్రంబుల
నిల్పుము. లేకున్న నీ మహాతల్లులు సైతము తనువులఁబాయ
నిశ్చయించిరి. యిప్పటికే నొక్కని నిందు ప్రాణముల హరిం
పఁజేసితిని. వీరు సైతము ప్రాణములఁ గోల్పోయిన నాకు
స్త్రీహత్య తప్పక సంభవించును. దానిచేఁ జెప్పశక్యము
గాని రౌరవాదినరకంబు లందుటయగాక యీలోకంబుననైన
లేని రుగ్మత లనుభవించుచు సంధిబంధంబులు గదల్పవశము
గాక వచింపవలనుగాని బాధనందుదును. గాన కరుణించి
యీ రాకొమరుని సజీవునిఁగ జేసి యీ తల్లులకు పతిభిక్షఁ
బెట్టి నాయఘంబు బాపుము. గాకున్న నీ కరమునం గల
చక్రప్రయోగముచే యీ రాకొమరుని వెంట పయనము జేసి
నన్నుగూడ బంపుము. (నమస్కరించును)

విష్ణు—వీరసేనా ! నీకోర్కెఁదీరెను లెమ్ము. నీ సత్యమునకును, వీరల
పాతివ్రత్యమునకును, సంతసించితిని. ఈతని సజీవునిఁ జేయు
మనియేగదా ప్రార్థన ?

వీ-మో-మాం-చిత్తము.

విష్ణు—జగన్మోహనా ! జగన్మోహనా ! లెమ్ము. నీ ప్రియకాంతలు
నీ కొఱకై నిరీక్షించుచుండిరి నిదురనుండి లెమ్ము.

(జగన్మోహనుఁడు లేచి నమస్కరించి)

శా॥ "శ్రీకృష్ణా! యదుభూషణా! నరసఖా! ♦ శృంగారరత్నాకరా!
లోకద్రోహి నరేంద్రవంశదహనా! ♦ లోకేశ్వరా! దేవతా
నీకబ్రాహ్మణగోగణార్తిహరణా! ♦ నిర్వాణసంధాయకా!
నీకున్ మ్రొక్కెదఁ ద్రుంపవే భవలతల్ ♦ నిత్యానుకంపానిధీ!"

దేవా! గరుడవాహనా! నీ దయారసముచే నీమె నాజాయయయ్యె. ధన్యుఁడనైతి—కృతార్థుఁడనైతి—రక్కసివాతంబడి మనినవాఁడ నగుటచే మిముగాంచుభాగ్యమబ్బె. వీరసేనరాజేంద్రా! కరుణింపుము. నీ యభయమువలననే సుకృతవంతుఁడనైతి.

మో-మాం-నాథా! నమస్కారము. ఏమీ మాభాగ్యము?

విష్ణు—వీరసేన రాజేంద్రా! ఈతఁడెవ్వఁడో యెఱుంగుదువా? ఈమె నీపుత్రియగు "మోహిని" ఈయమ వరించిన రాకొమరుఁడీతఁడు. వినుము. ఈ మోహిని రాక్షసాపహృతయై మిగుల గాసిలుచు విషాదమందుచుండుతఱి నీతఁడు మృగయావినోదార్థ మడవికేఁగి యలసి రక్కసి నందనోద్యానమున శయనించ నీబిడ్డ యీతని వరించి రక్కసి గృహమునకుం గొంపోయి "నన్ను జేపట్టు" మని ప్రార్థింప నీతఁడంగీకరింపకయు నీమెను రక్కసియే యనియు నమ్మకుండెను. పిమ్మట వీరిచర్యలెల్ల రక్కసిగ్రహించి యీతని సమయింప నమకట్ట నీతనిప్రాణముద్ధరించిన నారీరత్న మీమెయే. గాని యీతని విధికృతముచే రక్కసిచే మరణముఁ దప్పదయ్యె. ఆ దుష్ట రక్కసి నిన్ను నమ్మునట్లుజేసి యీతని మడియింపఁ జేసినది. వీరసేనా! వేయేల? ఈతఁడు నీయల్లుఁడు. ఈమె నీకూతురగు "మోహిని" ఈమె నీతని జ్యేష్ఠభార్య మాండవీదేవి పరిశుద్ధురాలు. వీరల పాతివ్రత్యముచే నీతఁడు పునర్జీవితుండయ్యె. ఇంక వీరిని నీ యిచ్చవచ్చిన తెఱంగున గౌరవించుము

జగన్మోహనా! ఇంక నీవీ సతీతిలకములంగూడి సర్వసుఖము లందుము. మహిళామణులారా! మీ పాతివ్రత్యమున కెంతయు సంతసించి మీ ప్రాణకాంతుఁడగు నీతనికి ప్రాణదానమొసంగితిని. మీరిద మీ మనోహరునింగూడి సుఖంపుచు నీపుడమియందు కీర్తిగాంచుఁడు. తడయరాదు నే నేగెద.

అందఱు-(నమస్కరించి) చిత్తమనుగ్రహింపుఁడు.

వీర—వైకుంఠవాసా! మీ కరుణాకటాక్షముచే నాకు శుభము చేకూరె. శలవొసగఁ వేడుచుంటిని.

విష్ణు—మంచిది. నే నేగెద.

గరుడవాహనమున పై కెగసిపోవును.

అందఱు— (అనుబంధము 29.)

యవనికజారును

పంచమాంకము సంపూర్ణము:

సీ॥ ధాత్రియందు భరద్వాజ గోత్రయుతుఁడు
కరము గూడూరు వంశ్యుండు ♦ ఘనయశుండు
మల్లయార్యుని పౌత్రుండు ♦ మాన్యతముఁడు
అరయ వేంకటశివకవి ♦ కాత్మజుండు
నిప్పుడీని రచించెఁ గో ♦ టీశ్వరుండు.—





# జగన్మోహన



## అనుబంధము.

జగ—　　　　1. హిం - తోడి - తాళము

ఏమీ ? యీనారీ జగన్మోహనాకారి కంతునికంగారి ! ఆహాహా॥
కనులుజాడ కల్వలు - కలికిమోము చంద్రుఁడు
కనగ మనము జెదరమేన్ - కంపమొంతోకగ్గెను　　　॥ఏ॥

కాపులు.　　　　2 రాగము—తాళము

గండాలుదండాలుదేవరా మే-ముండలేకవచ్చాముదేవరా ! ॥దం॥
పచ్చికపొలములు - పాడుజేసె మృగములు
సచ్చిపోతున్నాము - సత్తేమిదియంత　　　॥దం॥
పిల్లాజల్లలజాపి - పీడించుచున్నాయి
యిల్లూవాకిళ్ళిడిసి - యింకేమి సేత్తాము ?　　　॥దం॥

జగ—　　　　3 మోహన

కాంతా! యిటునిన్-గనుగొనవింతన్-గల్గెనునాకున్-గారణమేమే? ॥
తనువుకాంతిఁ దగ్గియుండె - మనమదేమొమూరియుండె
కనగ మోముకళలుమారె-కారణాలు? కలికి! జెపుమ! ॥కాం॥

మాండ— 4. హిం-తోడి-ఏకతాళము

మనవిని గైకొనుమా ! శూరా ! ధీరా ! వీరా !
వనమున కరుగకుడి - వచ్చునే[illegible] కష్టములు
అనుమీర జరుగనున్న - పనులు జరు గకపోన ?
ముందుగతి యెట్లుగలదో ? - మంద భాగ్యురాలనేను
డెందమందు మిమ్ముబాసి - యుండలేను మాను వేం ॥మ॥

ఘటో— 5 ఇంగ్లిషునోటు

ఈజగతిని నేనవ్వా - గజగజవడకరె ననుగన్న
అజహరిహరసురలహి - కిన్నరు లెల్లన్ ॥ఈ॥
అసురకాంతనాదు చైద - మద్భుతంబులౌనుగా.?
యిసుమంతైనన్ నేఖాతుకపనిసల్పగ-మరువనుగా?! ॥ఈ॥

ఘటో— 6 ఇగ్లింషునోటు—ఏకతాళము

పాతాకినామాట - పాటింపకుంటివ ?
పాపాము గీపాము - పాటింపకనునే
సీ తీ గ నిన్జంపి - ని న్నిదె భక్షింతు
నాతిరో ! గోతిరో ! - నాకడ నిలువె ? ॥పా॥
పెండిలియాడవె - యండజయానరో !
మొండిగనుండిన - ఖండింతు వండింతు ॥పా॥

జగ— 7 రాగము—తాళము

ఆహా ! యీావన్య మెంతో జూడ హాయి నిచ్చెగా ?!
మహా శ్రమన్ హరించి మదికి - మలయు మిచ్చెగా.?
హే ! చిత్రవిచిత్ర తరులతాగుల్మ నిస్తులంబు—
నానావిధసుమకోర గుచ్ఛఫలసమన్వితంబు—

వర్ణించ న్గాని ? దీని జూచి - వసుధ నేరికిన్
ఆశుక శారి కామయూర కలకంఠకంఠరవంబు—
వినవినగమనంబున కానందప్రదంబు— ॥ఆ॥

మోహి— 8. ముఖారి.

హా ! దైవమా ! ఎటులఁజేసెదో నన్నిక హా॥
పడరానిశ్రమ లే — పడుచుండిదీనిచే
యడరీతినేకట్టా ! — యేమినాపాపము ? హా॥

జగ— 9. హిం॥ తోడి — ఏకతాళము

ఆహా ! యీసఖి నెటు మది చెదరినముది వేల్పెటు
జేసెనోభళి ! వహ్వా ! వహ్వా ! ఆ॥
పాలతిని గనైన — గలత జెందెమది
జలజసాయకుఁడు నేచెను హా !
యిల పైఁ గల పైదలు లెవ్వరుదీని — సరికిగలరు ?
(ఈ) సరసిజముఖి దృక్సరములు పైనిడె నాహాహా ! ఆ॥

10. డైలాగ్.

జగ— ఓకలికి! మారు పలుకు పలుకకింకక దలిపొమ్మా! తగదుసుమ్మా
ఈకరణినితగదుసుమీ—ఓకముపకు జేరనీవు వేగ మేపొమ్మా ॥ఓ॥
మోహి—హా! కఠినా హృదయ నీకు — నయ్యో! జాలిలేదటరా ?
యీకామిని నిటు వీడిపోవ — కలదెఫలముఁ జూడరా ?
జగ—ఫలముగిలమిదే మొఱుంగ — భయుగల్గె నాకు నిన్గన
జలజనయన ! నన్నుఁగోరకు — సరగపురముఁజేరవలెను ॥ఓ॥

11. డైలాగ్

మోహి—ఈవేళీగఁడని దలచితివా ? — యీధరగలన్పపులలో
నీవే ధీరుడని దలచితివా ?

ధరణియందు — తరుణులందు — వైరమొందు — దగదు ఛీ !
యేరీతినాకు దెలియకుండ — పోయెడిమార్గము సాధించగా
తీవరమా ! — నీతపమా ! — కానుసునూ ? — వినుమురా ! ॥యీ॥
జగ — మానినిజనవు - మాటరువినవు - మర్యాదయంతయు సరిగా
దెలియవుగా ? రక్కసివిగా ?
మోహి - చాలుచాలింపుముక్రూరుండ ! నీ - సంగతిదెలసెనుచోరుండ
జగ — పట్టువీడుమమ్మ - పాపమింక బొమ్మ !
యిట్టుఘోరకమ్మ - యింతయు క్రూరము మా॥

12. డైలాగ్.

మోహి - నన్నింకనమ్మాకుపో - నరనాథ ! నీవు - నన్నింకనమ్మాకపో
కలికీనిగాదని - పలునూరుబల్కినా - పాటనుమరచితివా ?
జనము - వినుము - జాలమేల ? న॥
జగ — తప్పులనెన్నాకుమా ? — తరుణీరో ! యింక త॥
అతివారో! దెలియక - నాడీతి తప్పుల - నన్యాయిగానెంచకే?
మనవి - వినుము - మాటలేల ? త॥

13 డైలాగ్

మోహి - ఛీ ఛీ పోరాసిగ్గులేదా ? - స్త్రీలఘోర క్రేయమానా ?
క్షితింగలస్త్రీలంఘోర బాడియూరా ? -
ఔరా ! క్షితింగల స్త్రీలంఘోర బాడియూరా !
జగ — రామరామ నన్నుబ్రోవు - రాపుసేసుమేరయూన ?
పరునిహింస పాపమనెడి - పల్కుపల్కులెరుగవా ?
ఆహా ! పరునిహింస పాపమనెడి - పల్కుపల్కులెరుగవా ?

మోహి-స్త్రీలనమ్మదగునా ?
జగ—కోరిచేరినాన
మోహి-చాలుచాలుపోరా
జగ—బాలవేగరావె !
మోహి-మాటిమాటికిటులబల్కు - మతమునెవడుదెల్పెనీకు ?
మారుబల్కకీడ పోపోఛీ !
జగ—మాటలేల ? బోటివేగ - మారుకేళిదెల్పనన్ను
మందయాన - యిందురారారా.
మోహి-చాలునుచాలును - సరసంబులాడక - సరగూనపో
జగ—సరసిజానన ! - సరసములాడగ - సమయమిదియెరా॥

14 డైలాగ్

జగ—తప్పులమన్నించి దయగనుమా ప్రియా !
మోహి-తప్పులమన్నించ నేదగనో ప్రియా !
జగ—దయనుగనుమా - తరుణివినుమా - కోపామునగునా॥త॥
మోహి-దగ్గరరాకుమా - అంటబోకుమా - తప్పావిదలచుమా॥త॥
జగ—నన్నింక శ్రమల బెట్టకేమనోహరీ !
మోహి—నిన్నెవరు శ్రమలబెట్టి కట్టివెచిరీ ?
జగ—కృపగాంచుమా గుణవతీ ! —
మోహి-అటులాడకో నరపతీ ! —
జగ—బాలా యేలీలా - యీవేళ - నిలువాగజాల
మోహి-భూపాలా ! యీలీలా — యిదిమేలా ? - తగదింక పో పో

15 డైలాగ్

మోహి-ఛీఛీ ! దూరంబుగాపొమ్మికన్ - దగ్గరరాకుమా -
తప్పబల్కబోకుమా ॥ఛీ॥
రక్కసియనియు నీరాజసముఁజూపెదవా ?
నేటికైననన్నోటిగాను నొంచితివా ? ॥ఛీ॥

జగ—నీగుట్టును బెట్టును నేనెరుగక – అట్టులెదలచితి
క్షమియించినన్ – రట్టాలబెట్టాకెమనోహరీ !
నన్రట్టులబెట్టాకె మనోహరీ !
మోహి–లేకీ ! పల్గాకీ ! – పోకిరిమాటలనాడకు ఛీ
జగ—విల్కాలకోల్కి ! నన్ – జిత్తజుఁడుసాధించెనే ?
మోహి–నన్నుఁగూడుమనెదవా ?
జగ—నన్నుతాంగి ! గూడవా ?
మోహి–ఔరారా ! యీసారినాజోలికిరాకుమా ॥ఛీ॥

## 16 డైలాగ్

మోహి — నను గోరకు
జగ— నిను గోరితి
మోహి— గడుపాపము
జగ— వడిఁబ్రోవుము
మోహి— ఔర ! పాపము
జగ— నారీ ! తాపము
మోహి— పరనారిని నను గోరకు
జగ— పెరవాడన ? నను గూడుము
మోహి— చాలు చాలు పో
జగ— బాలా ! రా గదే
మోహి— ఔరా ! యిది తగునా ?
జగ— ఆహా ! యిది తగవా ?
మోహి— చాలు చాలు పో
జగ— యేలనన్ను రా
మోహి— ఔర ! పో పో ఛీ !
జగ— ఆహా ! రా రా రా

మోహి— పరనారిని
జగ— పెరవాడన !
మోహి— ననుగోరకు
జగ— నిను గోరితి
మోహి— పాపము—
జగ— తాపము—

ఘటో 17. రాగము

నీపలుకులు నీగిలుకులు నేవిని మదినమ్మితనుచు నెంచితివేమొ
(నా) కుటిలము వెలిబుచ్చి చనువియ – కుమతిరో: యి
ట్టులుగ జేసితివ ? – కలదంతయు వినవించుము – కా
రించను – కరుణింతును
నన్ను గానవా ! – మనసేరవా ? – కన్నుగానవా ? – క
య్యా మెంతువా ? ॥నీ॥

18. డైలాగ్

ఘటో—ఇదియే దెలుపకమనియెదవా ? నీ కపటపుపనులిటనీ
వేదెలుపకమనియెదవా?
ఎరిగితంచు – మదిని నెంచు – సుహితేవంచు దలచ ఛీ
యీావిధినాకునరకలేక – నెట్టులీకార్యము సాధింతువే ?
తీవరమా ?–కావరమా ?–కాదుసుమా ?–దెలుపవే ? యిది॥
మోహి–జననివినవు - తనయయనవు - సత్యమా నంతయు
వినునే – దెలిపితీనినే - దాచియుంచనే -
ఘటో–చాలుచాలింపుముఘాతకీ ! నీ - సంగతిదెలసెను - పాతకీ !
మోహి–రట్టుజేయకమ్మ - రాజపుత్రినమ్మ
పట్టు నమ్మమమ్మ - పట్టిది సర్వము జ॥

19 జైలాగ్

ఘటో__పోకిరిమగువా! నీకిదితగువా? మాటిమాటికీమాటనువిడవా?
నీకుమూడియే సిట్టులనిమెదవు-నిశాటాంగనని నీవెరుగవ ?సఖ !॥పో॥

మోహి__తల్లిరో ! నీవిటు - దండింపదగునట ?
యుల్లమువేరుగ - నుంచకు మ్రొక్కెద
కల్లగనంతయు - యుల్లము నెంచుము
కామినిపైనిట్టి - కయ్యము మానుము

ఘటో__వినయంబా ? యీరీతిగ ఛీ ! వినయంబా ? యీపల్కు-
లు నివినిజమానా?_వినయమునగినయ మువిరసంబౌనిక ఛి ॥వి॥

మోహి__పరిపరిగతులా - ప్రణుతులు జేసెద
దరిజేరినను - దద్దయు బ్రోవుము
యీవే నను బ్రోవాకున్నా - యేమిటి నాగతులిలను ?
బ్రోవవే ! దకు జేశ్వరి బ్రోవవే

ఘటో-క్రూరవుగడు కుచ్చితవు-కుటిలాత్మక నీవినయము చాలుచాలు
నిక చాలింపుము నీ - వేళనిజమువచియింపుము లలనా !
చాలుచాలునికసత్యముఁ జెప్పుము-నీ కీగతి నీయంత్యంబున కే
రావేమె ?-పాలింపను నిను పల్కగసత్యమురావేమె ? ॥పో॥

ఘటో__ 20 ఇంగ్లీషునోటు__ఆదితాళము

కసిదీరగన్ - అసిచేతనేన్ - వెసద్రుంచెదన్ - పసమీరగన్-
రాజున్ గీజున్ రయమున ద్రుంతున్-
మోహిన్ గీహిన్ ముదమున తిందున్
ముదంబెంతో యదన్ పొంగన్ - కథన్ జూపిన్ వధన్ జేయున్
మాయాలో ముంచితి - మర్మాము జేసితి - మంచిదీవేళ నె
ద్రుంచగ ॥కసి॥

మోహి— 21 ముఖారి

మోసముఁజేసెగా ! - యీసరిఘటోదరి ||మో||
కాంతునినమ్మించి - కాలికిగుఱిడి
గొంతును గోయగను -- గోర్కెలన్నుండె హా ||మో||

ఘటో— 22 ఇంగ్లీషునోటు—ఏకతాళము.

దానవవైరి - త్యాగిజీవోరి ! - తరిగదనేరా-చోరా
కానలజేరా - మానక్రూరా - ప్రాణముఁదీతున్ జోరా||
నరాధమక్రూరా ! ధరన్ నిన్నుదీరా జేతుకఱాసిచే
ద్రుంచివైతునని దలచియుండవు క్రూరా ! ||దా||
చోరుడవై యీవేళ - యీనారిన్ జేరన్ వచ్చితివా ?
సిబ్బిగముఁదీతున్-జూడుమురా-యీఖడ్గముతో నే ద్రుంచెదరా ||

ఘటో— 23 ఇంగ్లీషునోటు ఏకతాళము

జాలముసేయక - జంపిచేవీనిని
క్రోలుమునక్కము - గొంకకు జంకకు
చాలగతూరక - సత్వరఁజూపుము
జాలియు గీలియు - చాలించి ఖడ్గము ||జా||

ఘటో— 24 ఇంగ్లీషునోటు—ఏకతాళము

మింటన్ జారన్ - మంటిన్ దూరన్
వెంటన్ స్నంటిన్ - కంఠముద్రుంతున్
నీటన్ మునగన్ - నీటన్ దాగన్
చేటున్ జేతున్ - చెనటికి నానికి ||మిం||

ఘటో— 25 బేహాగ్ రాగము—ఆదితాళము

ఆశించినప్రోత్ప్రవమా - నాగతినాలించినన్ బ్రోవవా
సుకాంతనున్ గావవె - భూపాల ! భూపాల ! ||ఆ||
కాంతునిచేగడు - కస్తినిఁబొందితి
కాపాడి రక్షింపవే - ప్రాపునుఁజేరితి
కాపాడి రక్షింపవే - ధర దీనార్తి సంరక్షణా !

జగ— 26 ముఖారి

పోవుచున్నానే - భూపతియాజ్ఞచె పో॥
పోయెద యమపురి - పోలతిచే నేడిక
బాయగ ప్రాణముల్ - పద్మదళేక్షణ ! పో॥
కాలగలతీచేత - గలెనివిపత్తు
జాలియులేదాహా ! - చక్రధరా ! నీకు పో॥

హాం-మో— 27 హిం॥ తోడి

హా ! జగన్మోహనా ! ( బాసిపోతివా ? )
పాదురక్కసిచేతనీవు - ప్రాణములనుఁ బాసినావ ?
తేడనిన్నుగాంచుభాగ్య-మేడఁపున్నమోటులజూఁడసున్నప్రియ హా॥
రాజధానివీడినీవు - రమణి నన్ను బాసివేగ
పూజనీయ యిట్టులేతో - పుడమిని నేనికమడియక నేలను ? హా॥

అందరు— 28 శుద్ధబంగాళ—ఆదితాళము

హరినే వేడెద బ్రోచీగనుము
మరిమరి వేడెద - మానసమందున
కరివరదుడమది - గనికర ముంచియు
దర్శనమిచ్చియు - తప్పక బ్రోవవ ? హా॥
హరిదాసులని - యరమర లేకను
దరిశనమిచ్చియు - ధన్యులఁ జేయవె ? హా॥

అందరు— 29 మోహన

కమలాలోలా! - కలుషహరా! - కరివరదా! - సురవినుతా!
అమరానాథా! అచలగుణా! - విమలవిభా! - వితతుదయా!॥
శ్రీలోలా ! శ్రితపాలా ! ఘనలీలా ! గోపబాలా !
నారదాదివందనీయ్యా ఓ ... ... కమ॥
గానలోలా ! సాధుపాలా ! వేదసీలా ! మణిగణలోలా !
మందరధారాకర ! మహితవిచారణ ! మానితసత్కరుణా !
కో- టీ- శ్వ- రా పోషణా ! కమ॥

మంగళము.

# పురూరవ

[గూడూరు కోటీశ్వరరావు గారిచే రచియింపఁబడిన నాటకములు.]

షట్ చక్రవర్తులలో నాల్గవ చక్రవర్తి యగు పురూరవుని చరిత్రము. ఇది మిగుల మనోహరమైన పద్య, గద్య, పాటలచే ప్రదర్శనానుకూలముగ రచియింపబడినది. ఇందు జయప్రద పాతివ్రత్యము, శాంతము, ధర్మము, కని వినితీరవలెను. వెల రు 1—4—0

# మారుతీ మైరావణ సంగ్రామము

మైరావణుడు మోసముచేసి, రామలక్ష్మణులను దొంగిలించుట, వానరుల దుఃఖము, మతంగి దెల్పు నీతి, దోర్దండి తులాయంత్రమున నీళ్ళు దెచ్చుట, కాళీప్రసన్నము, మారుతిమైరావణుల యుద్ధము బహు రమ్యముగా యుండును. వెల రు 0—4—0

# తారాచంద్రీయము

ఇందు తారాచంద్రులశృంగారము విచిత్రము. కాముకులచర్య లన్నియు చక్కగ వర్ణించబడినవి. మంచి మట్లుగలవు. వెల 0-14-0

# ఆంధ్ర విజయము

గ్రంథకర్త: దూపాటి కొండమాచార్య కవిగారు.

ఇది ఆంధ్రులయొక్క చరిత్ర. పద్యగద్యములు ముద్దులు మూట గట్టుచుండును. రుద్రాంబ ఆడుదియైనను ఆమెయొక్క సాహసము వర్ణనాతీతము. వెల రు 1—0—0

# దైవచూడామణి

వెల 0-4-0

# నాగలింగేశ్వర శతకము

గ్రంథకర్త: సింజల సుబ్రహ్మణ్యంగారు.

వెల ప్రతి 1కి రు 0—4—0

వలయువారు:— సి. బి. దాస్ అండ్ కో

బుక్ సెల్లర్సు, పబ్లిషర్సు

[illegible]డపేట, గుంటూరుజిల్లా.

